# పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?

గౌరవ్ - 2015

ప్రవాహి ప్రచురణలు

ప్రజాస్వామ్య ప్రక్షాళనా వేదిక ఆధ్వర్యంలో

వివరాలకు : gouravmeka@gmail.com

ప్రతులకు : 9441089829

ప్రతిపాదిత విరాళం : రూ.20/-



"I might find myself wrestling with a false theory, but no false theory could wash away the fundamental problem that cried out for solution. every theroy of a social nature that I encountered could immediately be put to the simple test – did it recognise the brute fact of the existence of an oppressed class? Did it see that you could deprave people by oppressing them? To me it was obvious that every analysis of society had to begin by recognising this sharp class division that existed within it. This gave me my starting point..."

– **Hyman Levy,** Social Thinking

# సూచిక

# ప్రస్తావన

కాఫ్కా కథొటుంది. అందులో ఒక సైనికాధికారి నేరస్తుల్ని క్రూరంగా హింసించి చంపే మృత్యుయంత్రమొహటి పెట్టుకొని దాన్ని ప్రయోగించడాన్ని ఎలాగో ఒక ఔత్సాహిక పరిశోధకుడికి వివరిస్తూ చివరికి అతడే దానికి బలౌతాడు. అలా కొంతమందుంటారు. మనుషుల్ని పనికట్టుకుని ప్రత్యేకంగా మానసికంగా హింసిస్తూ సంతోషపడుతుంటారు. ఎదుటివారి ఔన్నత్యాన్ని ఏదోలా దిగజార్చడం కోసం పడరాని పాట్లన్నీ పడుతుంటారు. అకారణంగా వ్యక్తుల్ని చులకన చేస్తూ పొరపాట్లని భూతద్దంలో చూపిస్తూ ఉన్నత సంస్కారం గల మనుషుల్ని కించపరచడం ద్వారానే సంఘంలో తమ స్థాయి పెరుగుతుందనే అల్పుల మానసిక పరిస్థితిని చూసి జాలిపడ్డం మినహా మనమేం చేయలేం. ఈ పైశాచిక ప్రవృత్తితో ప్రవర్తించి తాత్కాలికంగా సంబరపడినా అంతిమంగా అంతుపట్టని ఈ అసహిష్ణుతా జాడ్యం వారికే ప్రమాదకరం. ఈ దేశపు ఆధ్యాత్మికత అనాదిగా మనుషుల ఆంతరికాభివృద్ధిపై ఎంతో దృష్టి పెట్టింది. ఉపనిషత్ చింతన వ్యక్తుల తాత్విక మార్పుకై లోతైన చర్చను చేసింది. మతగ్రంథాలన్నీ మానవికమయిన మానస్విక మార్పును మనసారా స్వాగతించినవే. మధ్యయుగాల భక్తి ఉద్యమాలు మొదలుకుని ఆధునిక భావోద్యమాల వరకూ ప్రజా ఆలోచనా స్రవంతిని మరింత సుసంపన్నం చేసేందుకు జరిగిన ప్రయత్నాలే. విచారకరమయిన విషయమేంటంటే, అనాలోచితమైన విగ్రహారాధ నకు, ఉన్మాదకరమైన వ్యక్తిపూజకూ నెలవైన ఈ నిలయంలో భిన్నమయిన ఆలోచనల్ని సామరస్యంగా ఆహ్వానించే స్నేహపూరిత వాతావరణాన్ని సహృద్భావంతో ఏర్పరిచే నిర్మాణాత్మక ప్రయత్నాల

సంఖ్య స్వల్పం కానడం. సత్యాన్ని వీక్షించే దృష్టి, ధర్మాన్ని దర్శించే దృష్టీ ఒకటే. అలాగే న్యాయాన్ని పాటించే తీరు, నైతికతను ఆచరించే తీరు ఒహటే. ఐతే, అందుకెంచుకున్న మార్గాలు, ఎదురయే అనుభవాల మలుపులు వేటికవి వేరుగా వుండొచ్చు. అంతమాత్రంలో ఆ బహుళత్వం శత్రుత్వం కానక్కర్లేదు. అది గ్రహించని వ్యక్తిత్వాల మనుగడ విద్వేషంపై ఆధారపడే మనగలుగుతుంటుంది. దాన్ని ప్రేమపూర్వకంగా మేల్కొలిపేందుకు చేసే ప్రయత్నాల వలనే మానవీయ సంస్కృతి ఎప్పటికప్పుడు మెరుగౌతుంటుంది. దాన్ని వ్యక్తిగత ఆచరణతో, సామాజిక ఆలంబనతో నిజాయితీగా, నిర్మలంగా కొనసాగించేందుకుగాను మన వంతు కృషి చేయడానికి మించిన ఘనకార్యమేదీ ఏ ఉద్యమానికీ లేదు. అందులో భాగంగా ఆయా సందర్భాల్లో స్పందించి రాస్తూ వచ్చిన కొన్ని కరపత్రాల్నీ, వ్యాసాల్నీ మరో యత్నంగా ఇలా మీ ముందుకు తీసుకురావడం జరుగుతోంది. ఈ పనిలోని నిబద్ధతను గుర్తించేందుకు ముందుకొచ్చే శక్తిలో వెయ్యోవంతైనా వ్యక్తులుగా మార్పుని నిజంగా ఆహ్వానించగలిగితే, అదీ పనిలోని పిసరంత శ్రమను మరిపించగలంతటి పునఃశక్తిని ప్రసాదించే ప్రేరణ అవుతుందని భావిస్తూ ఇక రచనలోకి ప్రవేశించమని మిమ్మల్ని కోరుతున్నాను.

\- గౌరవ్



# భావ ప్రకటనా స్వేచ్ఛను బతికించుకుందాం!

భావాలకు భయపడటం, విరుద్ధమయిన భావాల్ని వ్యక్తీకరించిన వారిపై భౌతిక దాడులకు పాల్పడడం అనాగరికం. మన అభిప్రాయాలతో విబేధించే వారి ఆలోచనలకు సైతం సముచిత స్థానం కల్పించడం ప్రజాతంత్ర సూత్రం. విభిన్న భావాలకు సమాజంలో చోటు కల్పించబడినప్పుడే నూతన ఆలోచనల్ని ఆహ్వానించే ప్రజాస్వామిక మనస్తత్వం ప్రజల్లో బలపడుతుంది. అలాకాక బలవంతులదే రాజ్యమైతే వారికి వత్తాసుపలకని భావాలన్నింటినీ అన్యాయంగా అణిచేయడం జరుగుతుంది. ఉన్మాదమే రాజ్యమేలుతున్నచోట ప్రజాతంత్ర ఉద్యమాల మనుగడ ప్రశ్నార్ధక మవడం వింతేమీ కాదుగానీ ఈ అక్రమాల్ని ప్రశ్నించీ-స్పందించే అభ్యుదయశక్తులు అలసత్వం వహిస్తే బావోద్యమాల భవిష్యత్తు అంధకారబంధురమై ప్రజాస్వామ్యం చచ్చుబడిపోతుంది. ఒకనాడు చార్వాకలోకాయుతుల్నీ, బౌద్ధుల్నీ, జైనుల్నీ, వీరశైవుల్నీ, వైష్ణవుల్నీ, క్రీస్తునీ, మహమ్మద్‌నీ, గాంధీని అంతం చేసి తాత్కాలికంగా సంతోషం పొందిన మతోన్మాద మూకలు ఇన్ని వందల సంవత్సరాల్నుంచీ సత్యాన్వేషకులపై కన్నెర్ర చేస్తూనే ఉన్నాయి. ఆ క్రమంలోనే నరేంద్ర దభోల్కర్‌తో మొదలెట్టి గోవిందపన్సారేను కూడా అలానే హత్య చేసారు. తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్‌ను మానసికంగా చిత్రవధచేసి ఆయనే స్వయంగా "నాలోని రచయిత చచ్చిపోయాడ"ని ప్రకటించేలా హింసించారు. ప్రాణాలు కాపాడుకోడం కోసం చెన్నైకి కుటుంబంతో బాటు పారిపోవాల్సి వచ్చింది. అలాగే డా॥ ఎమ్.ఎమ్. కల్‌బుర్గీని సరాసరి ఆయనింటికే వెళ్ళి కాల్చి చంపేసారు. కేంద్ర సాహిత్య అకాడమీ, కన్నడ సాహిత్య అకాడమి అవార్డులతో సహా ఎన్నో ప్రతిష్టాత్మక పురస్కారాల్ని పొందీ, హంపీ

విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్‌గా వుంటూ, బ్రాహ్మణీయ భావజాలానికి ఎదురొడ్డి నిల్చి, కులతత్వాన్ని చీల్చి చెండాడిన బసవుడిపై ప్రత్యేక పరిశోధనతో సహా వందకు పైగా గ్రంథాలు, వివిధ పరిశీలనాత్మక వ్యాసాలు రాసి అనేక చారిత్రక కోణాల్ని వెలికితీసిన కల్‌బుర్గిలాంటి మేధావిని, మూఢనమ్మకాల వ్యతిరేక చట్టాన్ని తీసుకురావడంపై డిమాండ్ చేస్తూ ఉద్యమం చేస్తున్నాడనే సాకుతో చంపడం మానవత్వానికే కళంకం. అలానే సునీల్ ఎడమరకు పై సుమారు 30 కేసులు పెడితే, మరో హేతువాది భగవాన్‌ను అంతర్జాలంలోనే మతోన్మాదశక్తులు హెచ్చరించాయి. ప్రబీర్‌ఘోష్ అనే హేతువాద కార్యకర్త పైనైతే ఇప్పటికి పదిసార్లు హత్యాయత్నాలు జరిగాయి. అందుకే ప్రతి భావోద్యమకారుని వద్దా ఆత్మరక్షణార్థం ఏదోక ఆయుధముండాలంటారాయన. ప్రపంచవ్యాప్తంగా భావోద్యమకారులపై దాడులు పెరుగుతున్నాయి. వ్యవస్థలో అభివృద్ధవుతున్న వైజ్ఞానిక ఆలోచనా విధానాన్ని మతతత్వ శక్తులు తట్టుకోలేక పోతున్నాయి. దళితులు, స్త్రీలపై అత్యాచారాలు, బావోద్యమకారులపై దాడులు పెట్రేగిపోతోన్న ప్రస్తుత తరుణంలో పౌరసమాజం, మేధావులు, ప్రజాతంత్ర వాదులు, స్వచ్ఛంద సంస్థలు, రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాలు మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా జరిగే ప్రచారోద్యమంలో భాగస్వాములై బాధ్యతాయుతంగా నడుచుకొన్నప్పుడే ఈ విధమైన అప్రజాస్వామ్య సంఘటనలకు అడ్డుకట్టవేసే అవకాశముంటుంది. మతోన్మాదం ఆధిపత్యం చెలాయిస్తున్న చోట మానవత్వానికెపుడూ ప్రమాదం పొంచి వుంటుంది. అలాంటి విపత్కర పరిస్థితుల్ని అధిగమించడం కోసం ప్రయత్నించడం, రాజ్యాంగ హక్కుల్ని కాపాడుకోవటంలో భాగమే. అందుకే భావప్రకటనా స్వేచ్ఛను పదిలపర్చుకోవడం నాగరిక ప్రజాస్వామ్య పరిరక్షణలో ముఖ్యమైన భాగం. స్వేచ్ఛాలోచనాపరులపై దాడులు మితిమీరుతున్న ఈ సందర్భంగా రాజ్యాంగ హక్కుల్ని కాలరాసే అన్ని నియంతృత్వశక్తులకూ ఎదురునిల్చేందుకు ప్రగతిశీలశక్తులన్నీ ఏకమవడం మంచి పరిణామం. అందుకు కలిసొచ్చే అభ్యుదయ వ్యక్తుల్ని - సంస్థల్నీ ఈ సందర్భంగా సాదరంగా స్వాగతిస్తూ మానవత్వంపై గౌరవం గల ప్రతి ఒక్కరూ ఇందులో భాగస్వాములవ్వగలరని ఆహ్వానిస్తున్నాం.

స్వేచ్ఛాలోచనాపరులపై దాడుల్ని ఖండిద్దామ్ !
హత్యలతో భావాల్ని నిర్మూలించలేరని చాటిచెబుదామ్ !!
ప్రజాస్వామ్య పరిరక్షణకై పాటుపడదామ్ !!!



# గ్రంథాలయాల పునరుజ్జీవనోద్యమంలో భాగస్వాములౌదాం...!

విజ్ఞానాన్ని విస్మరించిన సమాజం పురోగమించిన దాఖలాలు చరిత్రలో లేవు. ఏ కాలంలోని వ్యవస్థ పరిణితయినా అందులోని వ్యక్తులమేధో సంపద ద్వారానే గుర్తించబడుతుంది. ఉన్నతమయిన సంఘ నిర్మాణానికి ఉత్తమ సాహిత్యమెప్పుడూ దోహదం చేస్తుంది. అధ్యయనం లేని సమూహం అనుసరించడానికి పనికొస్తుంది తప్పితే సొంతంగా ఆలోచించడానికి కాదు. అత్యధికశాతం మంది ప్రజలు స్వతంత్రంగా యోచించగలిగినప్పుడే సామాజిక క్రమం సక్రమంగా సాగుతుంది. నూతన ఆవిష్కరణలకు అవకాశ ముంటుంది. మానవీయ విలువలతో కూడిన పరస్పర గౌరవనీయ మయిన ప్రజాస్వామిక వ్యవస్థ సాధ్యపడుతుంది. ఇందుకు పుస్తక పఠనం ఎంతోకొంత తోడ్పడుతుంది. ఈ నిజం గ్రహించడం వల్లనే గతంలో దేశంలోని అనేక ప్రాంతాల్లో గ్రంథాలయాల గురించిన ఉద్యమాలు జరిగాయి. ఉభయ తెలుగు రాష్ట్రాల్లో సైతం ఎన్నో గ్రామాలు చైతన్యవంతమై గ్రంధాలయోద్యమంలో చురుకుగా పాలుపంచుకుని ఎంతో చరిత్ర సృష్టించాయి. అయితే, రానురానూ ఈ పరిస్థితి తారుమారైంది. చదువనేది సత్యాన్వేషణా చిత్తంతో దార్శనిక దృష్టిని ఏర్పర్చుకునేందుకు ఉపయోగపడే సాధనంగా కాక, స్వార్థచింతనతో సామాజిక బాధ్యతను విస్మరిస్తూ సంపాదనే ముఖ్యంగా పనిచేసే హెూదాకోసం పాకులాడే లక్ష్యంగా తయారైంది. ఈ గాడిలో పడిన సమాజం ముఖ్యంగా విద్యార్థులు, యువత, స్త్రీలు, మైనారిటీ దళిత బహుజనులంతా వాస్తవాలకు తిలోదకాలిచ్చి ఆకర్షణల్ని ఆరాధిస్తున్నారు. ఇదో వినాశకర

పరిణామం. ఈ రోజుకీ ఎక్కువ శాతం గ్రామాల్లో గ్రంథాలయాల ఊసే లేదు. అక్కడక్కడా ఉన్నా, పట్టణాలు - నగరాల్లోలాగా కొంతయినా పుస్తక సంపదున్నవి చాలా తక్కువ. పైగా లెక్కలేనన్ని సంకుచిత కుల, మత, వర్ణ, వర్గ, లింగ వివక్షలతో కూడిన మన సమాజంలో ఊర్లలోని గ్రంథాలయాలు సైతం అగ్రవర్ణ పెద్ద మనుషులు, రాజకీయ నాయకులు, పరపతిగలమధ్యవర్తులు లేదా నిరుద్యోగులతో కాలక్షేపం కావించే విశ్రాంతి ప్రదేశాలుగా నడుస్తున్నాయే కాని వ్యక్తిత్వాన్ని నిర్మించే వైజ్ఞానిక కేంద్రాలుగా కాదు. ముఖ్యంగా స్త్రీలు, దళిత బహుజన మైనార్టీలు గ్రంథాలయాల్ని వినియోగించుకునే పరిస్థితి లేదు. ఇదిలాగే కొనసాగితే సమాజంలో వైజ్ఞానిక వంధ్యత్వం రావడానికి అట్టే కాలం పట్టదు. కాబట్టి గ్రామగ్రామాన గ్రంథాలయాల్ని పునర్నిర్మించుకోవలసిన బాధ్యత మనందరి మీదా వుంది. గ్రామంలో ఒక గుడో, చర్చో, మసీదో లేకపోతే వచ్చే నష్టం కన్నా గ్రంథాలయం లేపోతే వచ్చే నష్టం అపారమైంది. భావితరాలు అజ్ఞానంలో మగ్గిపోకుండా, ఉద్యోగాలకోసం మాత్రమే విద్యనభ్యసించే నాగరిక బానిసలుగా తయారుకాకుండా వుండాలంటే, గ్రామగ్రామానా గ్రంథాలయాలు రావాలి. ఆ గ్రంథాలయాలు కూడా పుస్తక నిక్షిప్త భవనాలుగా కాక సమాజ నిర్మాణానికి అవసరమయ్యే నూతన ఆలోచనలకు ప్రేరణనందించే విజ్ఞాన భాండాగారాలుగా, సాహిత్య, సాంస్కృతిక సమతా నిలయాలుగా విలసిల్లాలి. లక్షలుపోసి కట్టే మత సంబంధమయిన మందిరాలకంటే, కోట్ల రూపాయలవ్యాపారం చేసే కార్పొరేట్ షాపింగ్ మాల్స్ కంటే, కళ్ళు మిరుమిట్లు గొలిపే బహుళ అంతస్తులభవనాలకంటే... ప్రజలజీవితాన్ని బాగుచేసే ఒక చిన్న గ్రంథాలయ నిర్మాణం ఈ దేశానికి అత్యంతవసరం. దాన్ని నిజాయితీగా గుర్తించగలవారంతా ఈ గ్రంథాలయ పునరుజ్జీవనమనే బృహత్తరోద్యమంలో భాగస్వాములవ్వాలని ఆహ్వానిస్తున్నాం. రండి, ప్రభుత్వ, ప్రభుత్వేతర స్వచ్ఛంద గ్రంథాలయాల్ని బలోపేతం చేసుకోడంతోబాటు గ్రామాల్లో గ్రంథాలయ స్థాపనకై ప్రయత్నిద్దాం.

**గ్రామగ్రామాన గ్రంథాలయాలు స్థాపిద్దాం...!**

**భావితరాలకు వైజ్ఞానిక వారసత్వాన్ని సగర్వంగా అందిద్దాం.....!!**



# కుల నిర్మూలనోద్యమంలో భాగస్వాములౌదాం!

సమానావకాశాల కోసం జరిగినన్ని వుద్యమాలు సమాజంలోని కులభావనను నిర్మూలించడానికి జరగడం లేదు. రాజ్యాధికారం పేరుచెప్పి రాజకీయ దళారుల అవతారమెత్తే అణగారిన కులాల్లోంచొచ్చి అగ్రవర్ణాల పెద్దలకు కావుకాస్తున్న కుహనా మేధావుల అజ్ఞానం - అర్థజ్ఞానం కారణంగా దళిత బహుజనులు సాంఘిక పోరాట నిర్మాణానికి పూనుకోడం లేదు. ఈ క్రమంలో అస్తిత్వాన్ని చాటుకుందుకు పాట్లుపడే హడావుడి మూకలే కాని బలమైన అస్తిత్వోద్యమాన్ని నిర్మించేందుకు పాటుపడే భావజాలోద్యమాలు రావటం లేదు. పూలే అంబేద్కర్‌లను గుడ్డిగా పూజిస్తూ బుద్ధుడి బొమ్మ పెట్టుకుని అమ్ముడుపోవడానికి సిద్ధపడే సిగ్గుమాలిన ముఠాలతో పోలిస్తే, వారి ఆలోచనల వెలుగులో అధ్యయనంతో కూడిన ఆచరణని ఏర్పర్చుకునే నిబద్ధత కలిగిన నిజమైన భావోద్యమ సంఘాలు బాగా అరుదు. అందుకే దళిత బహుజన సంఘాల్లోని ఉపకులాల్లోనే కులాంతర వివాహాలు జరగని దౌర్భాగ్య పరిస్థితి నెలకొని వుంది. ఈ స్థితి మారాలి. కులాన్ని సాంఘిక నేరంగా పరిగణించే వాతావరణం రావాలి. విద్యావిధానం నుంచి మొత్తం మానవీయంగా మల్చబడాలి. ఇందుకోసం ముందుకొచ్చే నూతన తరం యువతీ యువకులంతా భావసారూప్యత గల వ్యక్తుల్తో సంఘాల్తో కల్సి కులాన్ని సమూలంగా అంతమొందించేందుకు సిద్ధం కావాలి. కులతత్వమొహ అనాగరిక జాడ్యం. భారద్దేశానికి పట్టిన ప్రమాదకరమయిన అంటురోగాల్లో ఈ అంటరానితనం వేల సంవత్సరాలనాటిది. ఈనాటికీ అత్యధిక శాతం ప్రజానీకంలో కులం గణనీయమయిన పాత్రను పోషిస్తోంది. ఎన్ని రకాలైన దాడులు చేసినా దేశంలో ఈనాటికీ కులస్వామ్యమే

ప్రజాస్వామ్యం పేరిట నడుస్తోందంటే కులమనే జబ్బు రానురానూ బాగు చేయడానికి వీల్లేనంత దారుణంగా ముదిరిపోయిం దనిపిస్తోంది. కుల నిర్మూలన కోసం మొదలయిన వారుసైతం బహుముఖ వ్యూహంతో కూడిన విస్తృతమయిన ప్రచారోద్యమాల్ని నిర్వహించడానికి బదులు, సాంఘిక హెూదా కోసం కొన్ని కులాల వైపు నుండి మాట్లాడుతూ, ఎంచుకున్నదారి తరపునుంచే ఎల్లప్పుడూ పోట్లాడ్డానికి సిద్ధమౌతుండడంతో ఈ దేశంలో అంతిమంగా కులనిర్మూలన కంటే కూడా కులరాజకీయాలే ప్రధానపాత్ర పోషిస్తున్నాయి. 90% దళిత బహుజనుల పరిస్థితుల్లో ఇప్పటికీ మార్పులేదనే నిజాన్ని గ్రహిస్తే కాని క్షేత్రస్థాయిలో ఆచరణాత్మకంగా అమలవుతోన్న అప్రకటిత అంటరానితనానికి సంబంధించిన నిజస్థితి మనకర్థంకాదు. కులాన్ని వ్యతిరేకించే పదాల్ని తగిలించుకున్న సంఘాలన్నీ యికనైనా ఆందోళనోద్యమాలకిస్తున్న ప్రాముఖ్యతలో వెయ్యోవంతైనా కులవ్యతిరేక ఆలోచనోద్యమాలకిస్తే, కుల నిర్మూలననే భావనను రాబోయే తరాలైనా లోతైన నిర్మాణాత్మక కార్యాచరణగా పాటించి ముందుకెళ్ళగలుగుతాయి.



# దిగువ కులాల ద్విజులారా ఏకంకండి ! పోరాడితే పోయేదేం లేదు పేదరికం తప్ప !!

"సంపూర్ణమైన సార్ధకత, వైఫల్యం ఎరుగని కృషి మనుషులకూ మానవ వ్యవహారాలకూ సాధ్యం కావు. మనుషులు సృష్టించుకున్న దేవుళ్ళకు మాత్రమే సాధ్యమవుతాయి. అందుకోసమే మనుషులు దేవుళ్ళను సృష్టించుకున్నారు. తమకు సాధ్యం కాని సంపూర్ణతనూ సమగ్రతనూ ఆపాదించి తమ సృష్టికి తామే భయపడి, తామే ఆరాధకులయి, తామే సేవకులయి బతకసాగారు. తమలోని వెలితికి అపరిపూర్ణతకు అతీతమైన ఆ దేవుళ్ళే చివరికి మనుషుల ఉనికికి ముఖ్యమయి పోయారంటే, ఆ దేవుళ్ళను చేతిలో పెట్టుకున్న పూజారులు అన్ని సంస్కృతులలోనూ మొదటి పెత్తందార్లు. దేవుళ్ళ సంగతేమోగానీ పూజార్లకు భయపడి బతికిన సుదీర్ఘమైన చరిత్ర మానవజాతికి అన్ని ప్రాంతాలలోనూ ఉంది"

- బాలగోపాల్

ఈ దేశపు ధర్మం చిత్రమైంది. అది అడుక్కొనే హక్కును, ఆధిపత్యం చెలాయించే స్వేచ్ఛనూ ఒక్క వర్గానికే ప్రసాదించింది. నిచ్చెనమెట్ల కుల వ్యవస్థలో ఇచ్చిపుచ్చుకునే సంప్రదాయం కాకుండా దిగువకులాలు, దళిత బహుజనుల వద్ద తేరగా పుచ్చుకునే సంస్కృతే స్థిరపడిపోయింది. అందుకే మనకు ఆరోగ్యకరంగా వుండి అడుక్కోడానికి కూడా అగ్రకులస్తుడై వుండాలనే నిబంధన ఉంది. అడుక్కోడంలో కూడా అసమానతలకు అవకాశం కల్పించింది. అందులో భాగంగానే పుష్కరాల సందర్భంగా వచ్చే తమ రాబడిని అడ్డుకుంటే సహించేది లేదని కొద్దిరోజులుగా బ్రాహ్మణ, పురోహిత సంఘాలు ప్రభుత్వాన్ని బెదిరిస్తూ వచ్చాయి. వాళ్ళ ఆదాయంలో గండి కొట్టాలనే ఉద్దేశంతో కాదుకానీ ఈ సందర్భంగా దిగువ కులాల్లో

సైతం ఎప్పట్నుంచో సంచార జీవులుగా వుంటూ, భిన్న వృత్తులు చేసుకు బతుకుతున్న యాచకులంతా ఏకం కావలసిన అవసరముంది. స్మశానఘట్టాల్లో సాధారణ బిచ్చగాళ్లు, దిగువ కులాలకి పౌరోహిత్యం చేసే జంగమ దేవరలు, బుడగ జంగాలు, మాలమాదిగ దాసర్లు, హరిదాసులు, సాతానులు, బడగా దేవరలు, బుడబుక్కలోళ్ళు, గంగిరెద్దుల వాళ్ళు ఇతర దళిత బహుజన గిరిజన పూజారులు, గూడెం పెద్దల వరకూ ఎవర్నీ పట్టించుకోకుండా అత్యధిక శాతం మంది ప్రజలకు ప్రాతినిధ్యం వహించే బి.సి. కులాల ముఖ్యులనూ, శ్రామిక దేవతల్ని కొలిచే స్త్రీలనూ తమ వారసత్వ సంస్కృతిని కొనసాగించే అవకాశం కల్పించకుండా కేవలం జనాభాలో అత్యల్ప శాతంగా నున్న బ్రాహ్మణులకి మాత్రమే పుష్కరాలకు విచ్చేసే ప్రజల కార్యక్రమాలు జరిపించడానికి అప్రకటిత అనుమతులివ్వడం, అధికారిక గుర్తింపు కార్డులు జారీ చేయడం అన్యాయం. గతంలో కూడా ఈ విధంగానే ప్రవర్తించి సమాజంలోని పీడిత కులాల పట్ల అంటరానితనాన్ని పాటించిన పాలకులు ఇకనైనా మారడం మంచిది. నిజానికి మొదట్లో బ్రాహ్మణ పురోహితులు అగ్రకులాల వారికి మాత్రమే పిండప్రదానాది కార్యక్రమాలు చేయిస్తూ దిగువ కులాల వారికి జరపడానికి నిరాకరించేవారు. అలా బ్రాహ్మణాధిపత్యాన్ని ధిక్కరిస్తూ దిగువకులాల వారు కూడా వారి వారి కట్టుబాట్ల కనుగుణంగా వారి కులాల్లో నుండే కొందర్ని పురోహితులుగా ఎన్నుకుని కార్యక్రమాలు వారిచేతే జరిపించుకునేవారు. కాలక్రమంలో అనేక కులవృత్తులు అంతరించిపోడం, అరుదైన కళలు మరుగునపడ్డంతో ఆ అవకాశాన్ని అంది పుచ్చుకున్న బ్రాహ్మణవర్గం పిండప్రదానం సైతం తమ హక్కునే భావిస్తోంది. ఈ పరిస్థితి మారాలి. దిగువ కులాల ద్విజులంతా ఐక్యంగా పోరాడి వారి హక్కుల్ని సాధించుకోవాలి. దుర్భర పరిస్థితుల్లో బతుకుతున్న బహుజన దళిత పెద్దలంతా వెంటనే స్పందించి తక్షణం సంఘటితం కావాలని విజ్ఞప్తి చేస్తున్నాం. కలిస్తే పోయేదేం లేదు కలహాలు తప్ప!



# ప్రజాస్వామ్య పద్ధతిని పటిష్టం చేసుకుందాం!

భారద్దేశ ప్రజాస్వామ్యం మౌలికంగానే భిన్న స్వరాలు కలది. అందుకే మనకు ప్రజా అవసరాల్ని గుర్తించేవారి కంటే ప్రజల లోపాల్ని ఎత్తిచూపే అవకాశవాదులే ఎక్కువ. పీడితుల హక్కుల్ని ప్రశ్నించేవారికంటే కూడా పౌరుల బాధ్యతల్ని గుర్తు చేసేందుకు తబ్బిబ్బయిపోయేవారే అధికం. అనేక వివక్షాయుతమైన దృక్పథాల మధ్య విశాలత్వపు అస్తిత్వం ఎలాగూ కష్టమే కాన, ప్రజాస్వామ్యమనే భావన శాసనాలకి పనికొచ్చినంతలా ఆచరణలో కనబడదు. ఆ కారణంగానే వ్యవస్థలోని దళిత బహుజన మైనార్టీలపై, ఇళ్ళలోని స్త్రీలూ, పిల్లలు, వృద్ధులు, వికలాంగులపై జరిగే అప్రజాస్వామికత మనకు అలవాటయిపోయి 'సాధారణంగా' కనిపించేంత ప్రమాదకర స్థాయికి ఎదిగిపోయింది. సమానత్వమనే భావన ఎప్పటికీ సాధ్యం కాని విషయంగా పరిగణించే రుగ్మత పెరిగిపోయింది. భౌతికంగా కష్టపడ్డం కొరగాని విషయంగా కనిపిస్తోంటే, సోమరితనం గౌరవించదగ్గ లక్షణంగా భావించబడుతోంది. పని చేయడమనేది దిగజారుడుతనంగా చూడబడుతూ, ఏ పనీ చేయకపోవడం పెద్దరికానికి చిహ్నంగానూ, కూర్చొని పనుల్ని పురమాయించడం మరింత ఉన్నతత్వానికి ప్రతీకగానూ ప్రతిష్టించబడుతోంది. ఈ కారణంగానే తమ జీవితాల్లో కష్టపడే దళిత బహుజన మైనారిటీ స్త్రీ... లందర్నీ తక్కువగా చూస్తూ వీళ్ళందరికీ సేవకులైన పాలక నాయకుల్నీ, ప్రభుత్వ యంత్రాంగాన్నీ, అధికారుల్ని నెత్తికెక్కించుకోడం జరుగుతోంది. ఈ పరిస్థితి మారాలి. నిచ్చెనమెట్ల అసమానతలతో నిండిన సామాజిక వ్యవస్థలో మొట్టమొదటున్న వ్యక్తీ - చిట్టచివరి వ్యక్తీ ఒకేలా వుండగలగాలి. నిత్య జీవితంలో అవలంబిస్తున్న అన్ని రకాలైన అప్రజాస్వామిక ధోరణుల్ని స్వచ్ఛందంగా విసర్జించడం ద్వారానే నాగరిక ప్రజాస్వామ్య విధానాన్ని మరింత బలోపేతం చేసుకోగలుగుతామ్. అందుకే, రండి. అసమానతల్ని వ్యతిరేకిద్దాం. సమానతను కాంక్షిద్దాం. అప్రజాస్వామ్యాన్ని తొలగిద్దాం, ప్రజా సామ్యాన్ని పరిరక్షించుకుందాం.

# మేగీ - యాగీ

మనూర్లో ఏ తినుబండారాల కొట్టువాడో ఆహార పదార్థాల్లో కల్తీచేసి అది బయటపడితే ముక్కుపిండి ముప్పయి కేసులు పెట్టికాని వదలని ప్రభుత్వ యంత్రాంగం కార్పొరేట్ మేగీ నూడుల్స్ విషయంలో ఆచితూచి అడుగేయడం, నిమ్మకు నీరెత్తినట్లు స్పందించడం నీరసంగా నిషేధించడం యాదృచ్ఛికం కాదు. బోఫోర్స్ కుంభకోణం మొదలుకుని భోపాల్ మారణకాండ దాకా, సామాన్య నేరస్తులకీ సామ్రాజ్యవాద నేరస్తులకీ మధ్య మన పాలకులు గీసిన గీత ఎప్పటికప్పుడు పెరుగుతూనే ఉంటుంది. నేరం అదే తరహాదైనప్పుడు వీధిరౌడీకి, వి.ఐ.పి.కి వివక్షెందుకనే ప్రశ్నకు చట్టం ముందు అందరూ సమానులేనన్న నినాదం జవాబు చెప్పడానికి సిద్ధపడదు కాబట్టే ఈ దేశంలో ప్రజాస్వామ్యమనే భావన ఎప్పుడూ వివాదస్పదమౌతుంటుంది.

ఇక విషయానికొస్తే దశాబ్దాల చరిత్ర కలిగీ, అశేష ప్రజానీకానికి ముఖ్యంగా పిల్లలకు, యువతకూ పసందైన ఫలహారంగా పేరొందిన 'మేగీనూడిల్స్' హానికరమని రాష్ట్రాలు, దేశాలు దాన్ని నిషేధించాయి. ఇతర కంపెనీలకి కన్నుకుట్టి కుట్ర పన్నడం వల్ల ఇది జరిగిందా లేక యిప్పటిదాకా అధికారులకిచ్చిన ఆమ్యామ్యాల విషయంలో వ్యవహారం బెడిసికొట్టిందా అనేది తర్వాతి సంగతి కాని అసలింతకూ ఈ మేగీ నూడిల్స్ కథేంటీ? వీటి పూర్వాపరాలేటీ? ఇప్పుడు వాటి మూలాలు చరిత్ర కంటే కూడా మన పిల్లల జీవితాలు, మానవాళి భవిష్యత్తు ముఖ్యమనుకుంటే ఇదే విషయాన్ని మరోలా ఆలోచించగలగాలి.

నిజమే. బయటపడింది కాబట్టీ ఈ పదార్థం ప్రమాదం. మరి బయటపడని కొన్ని వందలవేల కార్పొరేట్ సరుకుల మాటేమిటి? తిండానికి, తాగడానికి, ఊద్చడానికి, పీల్చడానికి, ఎదగడానికి, తరగడానికి, తెలుపుకి, నలుపుకి తల వెంట్రుకల్నించి

కాలిగోటి వరకూ, పూరిపాకలోని కూలివాడు మొదలుకుని ఊరిలోని మధ్యతరగతి జనాలదాకా ఎన్ని వందల కంపెనీల్ని పోషిస్తున్నామో ఎప్పుడైనా ఆలోచించామా? మనమేం తినాలో, ఏం తాగాలో, ఎలా బతకాలో, ఏ బట్టలేసుకోవాలో, ఏ సబ్బు వాడాలో, ఏ పౌడరు పూసుకోవాలో మన జీవితాల్తో ఏ మాత్రం సంబంధంలేని ఒక విదేశీ వ్యాపార సంస్థ నిర్ణయిస్తుందనే నిజం మనలో ఎంతమందికి తెల్సు?

టాటాకి నీళ్ళ ప్యాకెట్లూ, ఉప్పు సంచులూ ఎందుకు? రిలయెన్స్‌కి కూరగాయలూ, కిరాణాషాపులూ ఎందుకు? ఎందుకంటే ఈరోజు పరాధీనతను ఆధునికత పేరిట స్వచ్ఛందంగా స్వాగతించడానికి సిద్ధపడుతున్న మన సమాజంలో పౌరుల్ని దోచుకోవడంలో సైతం పోటీతత్వం పెరిగిపోయింది. యిప్పుడు సమస్యంతా ఏ సంస్థ ముందుగా దోచుకుంటున్నదనేది మాత్రమే. మార్కెట్ మాయాజాలానికి మంత్రముగ్ధులమైపోయి జీవితాంతం మనల్ని మనం పద్ధతిగల వినియోగదారులుగా, సరైన సరుకుల్ని జాగ్రత్తగా ఎంపిక చేసుకునే నిబద్ధతగల బానిసలుగా, కళ్ళను మిరుమిట్లుగొలిపే రంగురంగుల కాంతివంతమయిన ఆకర్షణలకు అప్రయత్నంగానే పట్టంకట్టే కట్టెలుగా మాత్రమే పనికొస్తున్నాం.

సత్యం మనకు ఎబ్బెట్టుగా కనిపిస్తుంది. అసత్యం హొయలొలికించి గిలిగింతలు పెడుతుంది. ధర్మం బోరుగా అనిపిస్తుంది. అధర్మం తలుపులు బార్లా తెరిచి ఆహ్వానిస్తుంది. న్యాయం చులకనగా తోస్తుంది. అన్యాయం ఆవహించి తొందర పెడుతుంది. యిది కేవలం ఆహార పదార్థాలకో కార్పొరేట్ మోసాలకో సంబంధించిన విషయం కాదు. మొత్తం వ్యవస్థకి సంబంధించింది. వాస్తవికతలోని సారాన్ని చేజేతులా చంపుకుని అవాస్తవికతనే పిప్పునే ఆధునికంగా భావిస్తున్న అనాలోచనత్వం మనది. అందకే మనుషుల్ని వాడుకుంటూ సరుకుల్తో, సంబంధాలు ఏర్పర్చుకుంటున్నాం. వ్యక్తుల్ని వుపయోగించుకొంటూ వస్తువుల్ని భద్రపరుచుకుంటున్నామ్.

ఈ రకమైన మనస్తత్వం ఏర్పర్చుకుని మనుషుల పేర్లు పెట్టుకుని రోబోల్లా బతికేయడం వల్ల మనమధ్య సంభవించే ఎంతటి పెద్ద విశేషాన్నయినా, విషాదాన్నయినా తోచినంత ఉదాసీనంగా తీసుకోడాన్నే నాగరికతలా భావించడం జరుగుతోంది. తోటివారితో ఏకమై వుండటమనేది లోకంచేత లోకువగా చూడబడుతూ, ఈర్ష్యాద్వేషాల్తో కూడిన పోటీతత్వాన్ని ప్రదర్శించుకోవడం వ్యక్తిత్వంగా గుర్తించబడుతోంది. దేశంలో పుట్టిన ప్రతీ రెండో బిడ్డ పోషకాహార లోపంతో బాధపడ్తున్నప్పుడు, కడుపు నిండే దారిలేక బాల్యంలోనే కష్టాలకి,

నేరాలకి లెక్కలేనంతమంది అలవాటు పడుతున్నప్పుడు, ప్రసార మాధ్యమాల్లో గంజితాగే పిల్లాడు వాళ్ళమ్మచేత మేగీ చేయించుకుని తినే దృశ్యాన్ని చూసి ఎన్ని లక్షల కోట్లమంది అమాయికంగా బలైపోయి ఇలాంటి పదార్థాల్ని ఎంతగా పెంచి పోషిస్తున్నారో తల్చుకుంటే భయమేస్తుంది.

పసిమనసులపై మాత్రమే గాక ఎంతోమంది ప్రజలపై ప్రభావం చూపే సినిమాతారలు, క్రీడాకారులు, సెలబ్రిటీలంతా గబ్బు ఉత్పత్తులకి ప్రచారం చేస్తూ అందినంత డబ్బు చేసుకుంటున్నారే కాని వాళ్ళను చూసి జబ్బులు కొనితెచ్చుకునే ప్రజల పట్ల బాధ్యత వహించరు. "నేను ప్రకటనలకు (అడ్వర్టైజ్ మెంట్లు) వ్యతిరేకం. అవి అసత్యాలతో కూడినవి కావడమే నా వ్యతిరేకతకు కారణం. మర్యాదగల ప్రతి పత్రిక ప్రజలు చదవాలని తాను అనుకునే పుస్తకాలను గురించి ప్రకటనలివ్వాలి. యిది నా ఉద్దేశంలో ప్రతి వార్తాపత్రిక యొక్క కర్తవ్యం. పనికివచ్చే విషయాల నన్నింటిని డబ్బు తీసుకొని ప్రకటించే ప్రత్యేక ప్రకటనా సంస్థ వుంటే బాగుంటుందని భావిస్తున్నాను. కాని ప్రకటనల ద్వారా వార్తాపత్రికలు డబ్బు చేసుకోవడం చాలా అసహ్యమైన పని. అది ప్రజలను మోసగించడమే" అంటారు మహాత్మాగాంధీ.

మన ఆహారాన్ని అధ్యయనం చేయడం మొదలెడితే తప్ప ఈ సమస్యను ఎదుర్కోలేం. శాస్త్రసాంకేతిక రంగాల మోహంలో చిక్కుకున్న అత్యధిక శాతం మంది విద్యార్థులు, యువత తాము రోజూ తినే ఆహారం సూపర్‌మార్కెట్లోంచి వస్తోందనే అజ్ఞానంతోనే ఇంజినీర్లుగా, డాక్టర్లుగా, లాయర్లుగా ఉద్యోగాలు వెలగబెడుతున్నారు. సాంప్రదాయ ఆహార పంటల పేర్లు కూడా గుర్తులేని ఈతరం అనివార్యంగా భావితరాల కడుపు (కొట్టే) నింపే విధిని కంపెనీలకు ఒప్పజెప్పిందంటే ఆశ్చర్యపోనక్కర్లేదు. తినేతిండి, తాగే నీరు, తొడిగే బట్టా, వాడే వస్తువు ఎలా వచ్చాయో తెలీని దౌర్భాగ్యస్థితి మనల్ని శ్రమదోపిడీ చేసే సంస్థలకి వంతపాడేవారిగా అంతిమంగా మార్చేసిందే తప్ప మానవీయ వ్యక్తులుగా కాదు. ఈ పరిస్థితి మారాలి.

"The industrial food chain that supplies our supermarkets stretches thousand miles and has dozens of different links. It's a chain that's powered by oil and gasoline and controlled by giant corporations. It's a chain that separates us from our food and keeps us from knowing what it really is we're eating." అంటారు మైకెల్ పొలేన్ The Omnivore's Dilemma (The Secrets Behind what you eat) అనే తన రచనలో. కావున ఇప్పటికయినా నిజాల్ని గ్రహించి ప్రకృతి సిద్ధమైన

జీవన విధానాల వైపు మళ్ళీ భావితరాలకి ఆరోగ్యకరమైన సమాజాన్ని అందించడం మనందరి బాధ్యత. అలా ప్రజల ఆరోగ్యంతో చెలగాటమాడే కార్పొరేట్ ఉత్పత్తులన్నిట్నీ సాధ్యమైనంతలో స్వచ్ఛందంగా విడనాడటం, ప్రభుత్వం వాట్నిశాశ్వతంగా నిషేదించడంతోబాటు ఆ సంస్థ బాధ్యులకి కఠినమైన శిక్ష వేయాలని డిమాండ్ చేయడం కూడా మన విధిలో భాగమే.

ఇంతటితో మన పనైపోలేదు. నిజానికి ఇక్కడ్నుంచే మొదలైంది. రంగురంగుల కాగితాల్లో పిల్లల దృష్టిని ఆకర్షించే ఖరీదైన చాక్లెట్లు, బిస్కెట్లు, కూల్‌డ్రింక్‌లు యింకా పలు రకాల పదార్థాల పరమార్థాన్ని యికనైనా తెలుసుకోడంతో బాటు బాల్యం నుంచే పిల్లలకు ఆరోగ్యకరమయిన అలవాట్లను పరిచయం చేసే ప్రయత్నం బాధ్యతగా చేయాలి. సరదాగా అప్పుడప్పుడు రుచి చూడ్డంతో మొదలయ్యే ఈ కార్పొరేట్ ఆహారపలవాట్లు క్రమంగా పిల్లల్లోని ఎదుగుదలను ఆటంకపరిచి జీర్ణవ్యవస్థపై, నాడీమండలంపై శాశ్వతంగా ప్రతికూల ప్రభావాల్ని కలిగిస్తాయి.

లక్షలాది మంది కుటుంబాల్ని ఛిద్రం చేస్తోన్న మద్యం తదితర పొగాకు ఉత్పత్తుల్ని అమ్ముకుని సొమ్ము చేసుకోడానికే అనుమతులిచ్చిన పాలక యంత్రాంగం కోట్లాదిమంది ప్రజలు వాడే వాణిజ్య పదార్థాలపై కఠినంగా చర్య తీసుకుంటుందంటే సందేహించడం సహజమే కాని ఈ విషయంలో పౌరసమాజం, స్వచ్ఛంద సంస్థలు, ప్రజాసంఘాలు సైతం పాలుపంచుకోవాలి. విచ్చలవిడిగా ప్రకటనలు గుప్పిస్తూ జన జీవితాల్ని తమ గుప్పిట్లోకి తీసుకున్న మేగీ తరహా కంపెనీ ఉత్పత్తుల్ని ఒకటికి రెండుసార్లు క్షుణ్ణంగా పరీక్షించి మాత్రమే అనుమతించాలి.

ఏదేమైనా వ్యాపారానికి స్వార్థమే పరమావధి అయినప్పుడు ప్రజా సంక్షేమంతో దానికి సంబంధం లేదు. వీలైనంత విస్తృతంగా వ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరించుకుని, కుదిరినంత మందిని వినియోగదారులుగా మలుచుకోవాలనేదే నేటి కార్పొరేట్ సంస్థల ఆంతరిక వ్యాపార సూత్రం. కాబట్టి ప్రజలు ఈ విషయంలో చైతన్యవంతం కావాలి. అక్కర్లేని వ్యర్థపు ఉత్పత్తుల వాడకానికి స్వస్తిచెప్పి ప్రకృతిబద్ధమయిన సహజసిద్ధ సమిష్టి జీవనవిధానానికి దగ్గరవడం ద్వారా ప్రత్యామ్నాయ మానవీయ వ్యవస్థ నిర్మాణానికి కృషి చెయ్యొచ్చు.



# భావోద్యమాల భావదరిద్రం

"అబ్బే స్త్రీలు పూర్వంలా ఎక్కడున్నారండీ, మీవన్నీ పూర్వకాలపు ఆలోచనలండీ. ఆడవాళ్ళు ఎంతో పురోగమించేస్తున్నారు, మీకు కనబడటం లేదాండీ."

ఒక నాస్తిక శిఖామణి ప్రేలాపన.

ఊఊఊ

"ఇంకెక్కడి దళితులండీ. ఎప్పుడో ఒకప్పుడుండేవారు. ఈరోజు వాళ్ళు 'అభివృద్ధి' అయినంతగా ఎవరూ కావట్లేదు., మీదంతా వెనకబడిన ఆలోచనండి."

మరో హేతువాద ప్రబుద్ధుడి ఉవాచ.

ఊఊఊ

"అంతమంది చావుకు కారణమైన ఉగ్రవాదుల్ని అస్సలు మనుషులుగానే చూడకూడదండీ. ఉరిశిక్ష వారికి తక్కువ. అంతకంటే భయంకరమయిన శిక్ష వేయాలి. నేరస్తుల్లో సంస్కరణనేది సాధ్యం కాదు సుమండీ"

ఇంకో లోకాయతుడి ఉద్బోధ.

ఊఊఊ

సామాజిక ఉద్యమాల్లో కొనసాగుతోన్న అంతర్గత పురుషాహంకారానికీ, అగ్రవర్ణాధిపత్యానికీ, అమానవీయతకూ పై సంభాషణలు చిన్నపాటి ఉదాహరణలు మాత్రమే. సమాజంలో అత్యధికశాతం మంది నమ్ముతున్న ఒక భావనను రెండు మూడు పుస్తకాలు చదివి తులనాడటమే నాస్తికత్వమనే అహంకారపూరిత వైఖరి

భావోద్యమాల ప్రధాన బలహీనత. వ్యవస్థలోని అసమానతలకూ అన్యాయాలకూ కారణాల్ని వెతికే ధైర్యం లేని మనస్తత్వాలు తోచిన సొంత సిద్ధాంతాల్ని ఊకదంపుడు పదజాలంతో వల్లెవేసుకోవడానికి అభ్యంతరం ఏమీ కాదు కానీ వాస్తవిక సమస్యల్ని గాలికొదిలి నాస్తికత్వమంటూ గాలి కబుర్లు చెబుతూ నంగనాచి వంకలతో కాలం వెళ్ళదీయడం వల్ల ప్రయోజనం లేదు. ఇదెంత సిగ్గుమాలిన సిద్ధాంతాలకు దారితీస్తోందంటే కొద్దోగొప్పో సామాజిక స్పృహ తప్పనిసరిగా కలిగుండాల్సిన భావోద్యమ కార్యకర్తల్లో సైతం స్త్రీలూ, దళిత బహుజనుల పట్ల చులకన భావం చోటుచేసుకొని ఉంది. "స్త్రీలు స్వతహాగానే శారీరకంగా బలహీనులనీ, పురుషులతో సమానంగా స్త్రీలు, కష్టపడలేరనీ, సంపాదించడం పురుషుడి పనైతే ఇంట్లో పనిచేస్తూ పడుండటమే ఆడవాళ్ళ విధనే" ఛాందస పురుషహంకారం భావోద్యమాల్లో కూడా బుసలుకొడుతోంది. స్త్రీలనూ, దళితులనూ విస్మరించి వారిపై తేలిక భావాలు కలిగున్నంతకాలం ఏ ఉద్యమానికీ పురోగతి లేదు. అలాగే, "దళితులంతా స్వార్థపరులనీ, ఇప్పటికే రిజర్వేషన్లు కొట్టేసి బాగుపడిపోయి కూడా యింకా హడావుడి చేస్తున్నారనీ, మిగిలినవార్ని బెదిరిస్తున్నారనే" సనాతన కులాధిపత్యం కొద్దోగొప్పో ఆలోచనాపరుల్లో సైతం వేళ్ళూనుకుని ఉంది. దశాబ్దాల దళితోద్యమాల చరిత్రలో, స్త్రీ ఉద్యమాల సంస్థల్లో ఎన్నడూ పాలుపంచుకోవడం కానీ చేయని ఈ కుహనా మేతావులు, స్వచ్ఛందంగానే స్త్రీలూ, దళితులూ అభివృద్ధయిపోతున్నా రంటూ గుండెలు బాదుకుంటున్నారు. ఇంట్లోని స్త్రీలను కనీసం మనుషులుగా చూసే సంస్కారం లేని సంతలూ, ఊర్లోని దళిత బహుజనులతో ఎన్నడూ ఏ సమస్యపైనా చర్చించని బొంతలూ, సమాజంలోని ముస్లిమ్‌లపట్ల అప్రకటితంగానే అమలవుతున్న వివక్షను చూడలేని గుంతలూ... సిద్ధాంత పదజాలంతో గారడీలు చేసేందుకు సిద్ధమౌతున్నారు తప్పితే ఇన్ని సంవత్సరాల తమ జీవితంలో ఒక్కసారైనా యుద్ధప్రాతిపదికన యదార్థాల్ని శోధించడానికి ముందుకు రావట్లేదు. ప్రపంచవ్యాప్తంగా జరుగుతోన్న హక్కుల ఉద్యమానికి సంబంధించిన కించిత్తు స్పృహకూడా లేకుండా కంటికి కన్నూ పంటికి పన్ననే అనాగరిక ప్రతీకారేచ్ఛకు ఆధునిక రూపంలోనున్న మరణశిక్షను సమర్థిస్తున్నారు.

ఒకవైపు మతస్తులతో మాటిమాటికీ పోల్చుకుంటూ, మతాలన్నింటినీ గేలిచేస్తూనే మరోవైపు ఆధునిక ఆలోచనల పేరుతో ఆటవికమైన మనువాదాన్ని

ప్రవేశపెట్టడం భావోద్యమాల్లోని ఒక బాపతు వర్గం పన్నాగం. అందులో భాగంగానే, కొన్ని పడికట్టు పదాల్ని పట్టుకు వేలాడుతూ హేతువాదం పేరుతో రోతవాదాన్నీ, లోకాయతం పేరుతో గోకుడు సిద్ధాంతాల్నీ పేలుతూండటం కనిపిస్తుంది. సామాజిక స్పృహలో భాగంకాని విషయ పరిజ్ఞానం విషతుల్యం. అది ప్రగతిశీల ఉద్యమాలకంటే ప్రగతి నిరోధక శక్తులకే ఎక్కువ వుపయోగపడుతుంది. చేతికి ఉంగరాలు పెట్టుకుని, మెళ్ళో గొలుసులేసుకుని, మేళతాళాలతో సంబరాలు చేసుకునే హేతువాదులు మనకు నాయకులవ్వడం కంటే దౌర్భాగ్యం మరోటి లేదు. భావోద్యమాల్లో వుండే యిలాటి అసమానతా సమర్థకులూ, దురహంకా రులూ తమకున్న కొద్దిపాటి మిడిమిడి జ్ఞానాన్నీ అందర్లో మిడిసిపడుతూ ప్రదర్శించుకుంటానికో, ఆర్థికంగా సాంఘికంగా పైకెదగడానికో వినియోగించు కుంటారేగానీ అవినీతి, అక్రమాల్ని ప్రశ్నించడానికో లేదా ప్రజాఉద్యమాల్ని సమర్ధించుకోవడానికో కాదు. మహిళా ఉద్యమాలకు భవిష్యత్తు లేదనీ, దళితోద్యమాలన్నీ దళారులతో నిండుకున్నాయనీ, అసలు సామాజిక ఉద్యమాల వల్ల ప్రయోజనం లేదనీ ఈ రోజుల్లో అంతా డబ్బు మయమనీ డాబుకబుర్లు చెబుతూ డబ్బావాయించుకోవడంలో చూపే ఉత్సాహాన్నీ, ఆసక్తినీ వారికున్న పరిధిలో ఏదో మేరకు వీలున్న సంస్థలతో భాగమవుతూ లేదా వ్యక్తిగతంగా తోచిన సామాజిక కార్యక్రమాల్లో పాలుపంచుకోడంలోనో చూపించరు. ఉన్నత చదువులు చదివి కన్నవారిని మర్చిపోయి కంపెనీలకు ఊడిగం చేసే స్వార్ధపరులకంటే, ఉద్యమ సాహిత్యాన్ని ఉపయోగించుకుని సమాజాన్ని విస్మరించి ధనార్జనే లక్ష్యంగా చేసుకొన్న సాంఘిక ద్రోహులే మరింత ప్రమాదకారులు. సామాజిక మార్పుకోసం అసలే మాత్రం ప్రయత్నించకుండా, కనీసం అలా ప్రయత్నిస్తోన్న వ్యక్తులు, సంస్థలతో కలిసి పనిచేయకుండా 'మార్పు' అసాధ్యమనే అక్కుబ్‌బక్కుమ్ వాదాలు చేయడానికి ఎంతమాత్రం వెనకాడని వీరు భావోద్యమాలకు పట్టిన చీడపురుగులు.

ఏ వ్యవస్థ యొక్క ఉన్నతయినా అందులోని అణగారిన వర్గాల జీవన పరిస్థితుల ఆధారంగా కొలవబడాలే కాని కులీన వర్గాల ప్రచారాల పరంగా కాదు. అదర్థం కాకుండా సమాజంలో జరుగుతున్న సంఘటనల యదార్థసారం ఏదీ అర్థం కాదు. కాబట్టే, పురుషస్వామ్య వ్యవస్థలో న్యాయస్థానాలు సైతం

భాగమేననే స్పృహలేకుండా, పురుషహంకారానికి న్యాయమూర్తులు కూడా అతీతులు కారనే విషయాన్ని గ్రహించకుండా, చట్టాల దుర్వినియోగానికి స్త్రీలు పాల్పడటంపై న్యాయస్థానాల భావాలకు నిలువనిస్తాం. అదే ధోరణిలో, ఈ దేశపు న్యాయవ్యవస్థ అత్యధికశాతం అగ్రవర్ణ కులాధిపత్యానికే కట్టుబడి వుందనే నిజాన్ని తుంగలో తొక్కి దళితులపై దాడిచేసిన వారంతా నిర్దోషులేనంటే నోరు మూసుకుని నమ్మేస్తాం. ఎంతోమంది చావుకు కారణమైన వాళ్ళను అదేచావుతో శిక్షించడం సమంజసమేనని వాదిస్తాం. ఏ చర్యనైతే అమానవీయంగా పరిగణించి అది చేసినందుకు నేరంగా దాన్ని అసహ్యించుకుంటామో, అదే చర్యను చేసిన నేరానికి శిక్షగా నేరస్తుడికి విధించడం ఎంతవరకూ న్యాయమనే ప్రశ్నమనకి రాదు. రెండొందల మంది చావుకు కారణమైన ఉగ్రవాదిని విచారణ పేరుతో సంవత్సరాల పాటు జైల్లో మగ్గపెట్టి చంపడం సరైనదే ఐతే, రెండువేలమంది అమాయకుల దారుణమైన హత్యలకూ, యింకా లెక్కలేనంతమంది స్త్రీలపై అత్యాచారాలకూ, కారణమైన వ్యక్తే ఈరోజు యావద్దేశానికీ నాయకత్వం వెలగబెట్టడం ఎంతవరకూ నాగరికమనే ప్రశ్నే తట్టదు. పైగా ప్రాణమనేదాని విలువను అత్యున్నతమైందిగా పరిగణించాల్సిన మనస్తత్వాలకు బదులు ఎక్కువమంది ప్రాణాలు తీసినవారి ప్రాణాన్ని సామూహిక ప్రతీకారేచ్ఛతో రెచ్చకొట్టి తీయడమనేదో ప్రజాస్వామిక దృక్పథంగా చలామణీ చేయటం మూలంగా, క్రూరమయిన నేరస్తులపట్ల మరింత దారుణమయిన శిక్షల్ని అమలు చేయాలంటూ ప్రజలే ర్యాలీలు, ధర్నాలు చేయడం జరుగుతోంది. ఇంతకంటే అమానుషకరమయిన విషయం మరోటి లేదు. నాగరిక ప్రజాస్వామ్యానికి సంస్కారణాభిలాష, సామాజిక మార్పు ముఖ్యమైనవి. వ్యక్తిలో మార్పు సాధ్యమనే మానవీయ స్పృహ వీటికి పునాది. ఆ భావనల్ని పెంపొందించుకోవడంలో ప్రభుత్వ యంత్రాంగం, పాలకవర్గాలు, న్యాయవ్యవస్థతో సహా అంతా వెనకబడే ఉండటం మూలంగా ప్రపంచంలో దాదాపు అత్యధికశాతం దేశాలు అనాగరికంగా భావించి మినహాయించిన మరణశిక్ష, మన దేశంలో మాత్రం అత్యధికశాతం మంది ప్రజల ఆదిమకాలంనాటి మనస్తత్వాల్ని సంతృప్తిపరుస్తూ యింకా అమలౌతోంది. రాజ్యాల్ని వ్యతిరేకిస్తూ తీవ్రవాద కార్యకలాపాలకు పాల్పడ్డారనే నేరారోపణతో బ్రిటీష్ ప్రభుత్వం చేత ఉరితీయబడ్డ భరత్‌సింగ్ మొదగలువారు మనకు

ఆరాధనీయులైపోయి విదేశీ తీవ్రవాదులపట్ల బ్రిటీష్ ప్రభుత్వ వైఖరి అనాగరిక మైందిగా - అన్యాయకరమైందిగా మనకనిపిస్తుంది గానీ, అవే చట్టాలతో అదే విచారణా విధానంలో తోటి దేశపు ఆవేశపరులపై ఈనాటికీ దేశ న్యాయస్థానంలో అవే శిక్షల్ని అమలు జరపడం మాత్రం ఎందుకు అన్యాయం, అనాగరికం అవదోననే ప్రశ్న మనకు రాదు.

స్త్రీలు, దళిత బహుజనులు, నేరస్తుల విషయంలో యింకా వెనకబడిన అశాస్త్రీయ భావాల్ని మనసులో నింపుకుని, ఉద్యమరంగంలో పెద్ద అభ్యుదయ వాదులుగా, అధ్యయన పరులుగా ఫోజు కొట్టడం వల్ల ఉపయోగం లేదు. వ్యక్తిగత ఆచరణ ద్వారా, నిర్మించబడని వ్యక్తిత్వం అదెంత విజ్ఞానదాయకమైనదైనా వృధాయే. ఖాళీ సమయాన్ని కాలక్షేపం చేసుకుందుకో, స్వప్రయోజనాల కోసమో, లేదా నలుగుర్లో విలక్షణంగా కనిపించేందుకో జ్ఞానాన్ని, ఉద్యమాన్నీ ఉపయోగించు కోవడం అలవాటయిపోయిన మూకలకు క్షేత్రస్థాయిలో జరిగే ప్రయత్నాలకి సంబంధించిన జ్ఞానం లేకపోవడం వింతేమీ కాదు కానీ సామాజిక పురోగతికి నిజమయిన ప్రతీకయిన వాటిపట్ల చులకన భావం తగదు. స్త్రీ, దళిత బహుజన అస్తిత్వోద్యమాలన్నీ అందుకే వీరికి తక్కువగా కనిపిస్తుంటాయి. ఎప్పుడూ ఈ ఉద్యమాల గురించీ అధ్యయనం చేయకుండా, అసలు అస్తిత్వోద్యమాల నేపధ్యాన్ని పరిశీలించకుండానే వాటిపై నోటికొచ్చిన కూతలు కూస్తూ, కలానికొచ్చిన రాతలు రాస్తూ కాలాన్ని ఖూనీ చేస్తుంటారు. నిజాయితీ, నిబద్ధత కలిగి ప్రజా ఉద్యమాల్లో పరిమితమయిన భూమికను పోషించేందుకు సిద్ధపడేవారంతా ఇలాంటి ఉద్యమ దొంగలపట్ల జాగ్రత్తగా వుండాలనీ, వీరి మాటలకూ, రాతలకూ మోసపోకూడదని విన్నవించుకుంటూ, అస్తిత్వోద్యమాలతో మిళితం కాని భావోద్యమాల భవితవ్యం అయోమయమేననే విషయాన్ని మరొక్కసారి మనవి చేస్తూ ఇక్కడికాగుతున్నాను.

ప్రజాస్వామికం కాని ప్రజ్ఞ ప్రజాస్వామ్యానికే ప్రమాదం.



# ముస్లిమ్‌ల స్థితిగతులు - ఒక అంచనా

ఈ దేశంలో నిష్పక్షపాతంగా మనుషుల జీవన విధానాన్ని అంచనా వేసే పరిస్థితి ఎప్పుడో అరుదుగా మాత్రమే సాధ్యమవడం మూలాన, అన్ని సందర్భాల్లోను అణగారిన, మైనారిటీ, స్త్రీ దళిత బహుజనుల విషయంలో అత్యధిక శాతం అవాస్తవికతే రాజ్యమేలుతుంటుంది. ముఖ్యంగా ముస్లిమ్‌ల విషయంలో మహాత్ములు మొదలుకొని సామాన్యుల వరకూ ఒకే రకమైన పిడివాదనలు వినిపించడమే మంచిదనుకోడంతో ఇండియన్ సెక్యులరిజమ్ ఉదాసీనతకే కట్టుబడిపోయింది. ఇస్లామ్‌కి సమానార్థంగా తీవ్రవాదాన్ని ప్రచారం చేసే మతోన్మాదం సామాన్య ప్రజానీకంలోకి కూడా ఎంతో కొంత చొచ్చుకుపోవడంతో ముస్లిమ్ అనే పిలుపు శతాబ్దాల చరిత్ర కలిగి ప్రపంచవ్యాప్తంగా ఎన్నో ప్రాంతాల్ని ప్రతిభాయుతంగా ప్రభావితం చేయగల్గి అనేక సంవత్సరాలుగా సామాన్య ప్రజల జీవితాల్లో విడదీయలేని భాగమయిన ధార్మికమతంగా కాక, కరుడుగట్టిన ఉద్రేకాలు-ఉన్మాదాలు ఆందోళనతో కూడిన అరాజకత్వంగా మాత్రమే మనకి కనిపించడం యాదృచ్ఛికం కాదు. ఎన్నో రోజుల్నుంచి మనతోబాటే కలిసి జీవిస్తున్న పేదముస్లిం సమాజంపై కూడా అకారణమయిన అసూయాద్వేషాల్ని తీవ్రంగా రెచ్చగొట్టడంతో హిందూత్వశక్తులు సాధించిన వినాశకరమయిన విజయమిది. బాల్యం నుంచీ ఈ దేశపు ముస్లిమ్‌ల జీవితం ఎక్కువ శాతం దుర్భరంగానే గడుస్తుంది. విద్యావిధానంలో దళిత బహుజన విద్యార్థులతో పోలిస్తే వీరి స్థితి మరీ అధమం. చిన్నతనంనుంచే పనిచేసే కుటుంబానికి అండగా నిలవాల్సిన అనివార్యమయిన పరిస్థితులు కారణంగా అత్యధికశాతం మంది ముస్లిమ్‌ల చదువు ఆదిలోనే ఆగిపోతుంది.

కొద్దోగొప్పో చదూకున్న వారికున్న అవకాశాలు కూడా అంతంతమాత్రమే. అప్రకటితంగానే ఒక మార్గానికి కట్టుబడిన మతస్థులందర్నీ నేరస్థులుగా పరిగణిస్తూ నిరంతరం అనుమానితులుగా పరిగణించడమంత అన్యాయం మరోటి లేదు. చిత్రమేమిటంటే, ఈ తరహా ప్రశ్నని లౌకికవాదులపై సంధిస్తూ మతోన్మాదానికీ - మతానికీ తేడా వుందంటూ హిందూ విధ్వంసక శక్తులతో కలవడానికి ఇష్టపడని లిబరల్ హిందూసంఘాలు సైతం ఈ విషయంపై దృష్టి (పెట్టాల్సినంత) పెట్టకపోవడంతో స్వతహాగానే ఎంతో ప్రగతిశీల పాత్ర పోషించిన ఇస్లాం, భారద్దేశ ప్రజలచేత అపార్థం చేసుకోబడింది. మహాత్మాగాంధీ మొదలుకుని మహామేధావి అంబేద్కర్ వరకూ ఈ పరిస్థితికి కారణమని నేనంటే చరిత్ర పరిజ్ఞానం ఉన్నవాళ్ళు మినహా ఎవరూ అర్థం చేసుకోకపోవచ్చును గానీ, యితర మైనారిటీ మతాలతో పోలిస్తే ఇస్లామ్ విషయంలో కాంగ్రెస్ నుంచి కమ్యూనిస్టుల దాకా అపరాధులే అవుతారనడంలో సందేహం లేదు. 'ముస్లిమ్‌లంతా ఉగ్రవాదులు కాదు కానీ ఉగ్రవాదులంతా ముస్లిములేనన్న' క్షుద్ర ప్రచారం పేదమధ్యతరగతి ప్రజల్లో కూడా ఎంతగా వ్యాపిస్తోందో తెల్సిందే. ఇదే తర్కాన్ని కొద్దిగా విస్తృతం చేసుకుని హిందూలందరూ ఉన్మాదులు కారుగానీ మతోన్మాద విద్వేష మూకలన్నీ హిందూలవేనంటే మతం ముసుగేసుకున్న ఆధిపత్యశక్తులు ఏం సమాధానం చెబుతాయో? ప్రపంచంలో ఎక్కడాలేని విధంగా మైనారిటీల్ని నెత్తికెక్కించుకున్నా మంటూ జబ్బలు చరుచుకునే పెద్ద మనుషులకు అనేక దేశాల్లో మైనారిటీలైన హిందువులకు కల్పిస్తున్న హక్కుల వివరాలు పట్టవు. అగ్రరాజ్యాల్లో సైతం హిందూ దేవాలయ నిర్మాణాలకు అనుమతిస్తున్నారంటే, అదంతా మన గొప్పతనమేనని ఇంతకాలంగా మనకి తట్టిందేకాని వారి ఔన్నత్యంగా తోచలేదు.

ఈ దేశంలోని ముస్లిమ్‌లను పాకిస్తాన్‌కు పొమ్మనేంత బరితెగింపు ఎప్పుడైతే వచ్చిందో అప్పుడే మన లౌకికవాదం, మత సామరస్యం మంటగల్సాయి. ముస్లిమ్‌లంతా పాకిస్తాన్‌లోనే వుండాలన్న సూత్రం సరేనదే ఐతే, హిందూలకోసం నేపాల్ మాత్రమే ఉందన్న లౌక్యం మంచిదే కావాలి. కానీ అలా కాదు. దౌర్భాగ్యకరమయిన సంగతేంటంతే ఇండియాలో ముస్లిమ్‌లకు వారు 'కూడా' ఇండియన్సేననే విషయం నిరంతరం బహిరంగంగా నిరూపించుకోవలసిన పరిస్థితులు కల్పించబడటం. 'ఈ దేశం మాదేనన్న' సంఘాల సమక్షంలో, 'మేమూ ఈ దేశపు పౌరులమేనన్న' విషయాన్ని బలవంతంగా ప్రకటించుకోవాల్సి రావడం.

పోనీ అందుకోసం వారు నెచ్చించేదేంటంటే నీచమయిన బతుకులు, దుర్భర పరిస్థితులు, సూటిపోటి మాటలు, అవిద్య, నిరుద్యోగం, అంటరానితనం, అణిచివేత. దేశంలోని ముస్లిమ్‌ల స్థితిగతుల్ని హేతుబద్ధంగా పరిశీలించిన ప్రభుత్వ - ప్రభుత్వేతర నివేదికలన్నీ యిదే నిజాన్ని తేటతెల్లం చేస్తున్నాయి. ఇదంతా ఒకెత్తయితే దైనందిన జీవితంలో కలిసి జీవిస్తున్న వారి మధ్యనే అనుక్షణం తమ 'విశ్వసనీయత'ని చూపించుకోవాల్సిన పరిణామాలు ఎదురుకావడం. సామాన్య వాతావరణంలోనే 'ఈ దేశంలో వుండాలంటే వందేమాతరం పాడాలని', 'రెండో తరగతి పౌరులు'గా జీవించాలనీ, హిందూలకు 'లొంగి' వుండాలనే నినాదాలు లేవదీసే ముష్కరులు యిక అణగారిన వర్గాల్లోని ప్రశ్నించగలిగే చైతన్యాన్ని సహృద్భావంతో ఆహ్వానిస్తాయనుకోవడం అత్యాసవదా? ఆత్మగౌరవంతో బతికే హక్కు అందరికీ ఉందనే రాజ్యాంగానికి తెలీకపోవచ్చును గానీ, నిత్యం మతోన్మాద మూకలమధ్య చస్తూ బతికే బడుగుజీవులకూ, పేదముస్లింలకూ తెల్సు ఎదురు తిరిగి ప్రశ్నించడమంటూ జరిగితే వారు పణంగా పెట్టాల్సింది వాళ్ళ జీవితాల్ననీ, వాళ్ళ కుటుంబ సభ్యుల మాన ప్రాణాల్నని.

ఇక ముస్లిమ్ స్త్రీల స్థితి మరింత ఘోరం. మామూలుగానే నిరక్షరాస్యత, అజ్ఞానం, మూఢత్వం మూర్తీభవించిన ముస్లిమ్‌లలోని అన్ని వర్గాల్లో స్త్రీల పరిస్థితి అణిచివేతకు పర్యాయపదంలా వుంటుంది. భారతీయతలోని సంస్కృతీ సంప్రదాయాలతో అనేక తరాలుగా ప్రభావితమయిన స్త్రీ-పురుష సంబంధాలనేవి ఇక్కడి ఇస్లామ్‌లో సైతం యిముడ్చబడ్డాయి. అరేబియాలోని అనాగరిక ఎడారి ముఠాల్లో మహమ్మద్ తెచ్చిన మార్పు విషయమేమోగానీ అత్యధిక శాతం మంది భారతీయ ముస్లిం మహిళలు మాత్రం కుటుంబ హింసనూ - సామాజిక హింసనూ లోతుగా ఎదుర్కొంటున్నారు. మానసిక, శారీరక, లైంగిక హింసల్ని వెనకబడ్డ దళిత బహుజన స్త్రీలతో పోల్చుకుంటే మరింత ఎక్కువగా భరిస్తున్నారు. మామూలుగానే స్త్రీ జీవితానికీ, వివాహ బంధానికీ ప్రజాస్వామిక దృక్పథాన్నివ్వని ప్రవక్త తీరు యిప్పుడు వివాదస్పదమయినా, మరీ అనాగరిక తెగల్లోని ఆనాటి పశుప్రవృత్తిని అరికట్టడానికి కొంతలో కొంతయినా యిస్లామ్ పాటుపడిందని ఒప్పుకోవాలి. (ఆయన మొదటి భార్య ఖడీజా వ్యక్తిత్వమే యిందుకు కారణమనేది కొందరు చరిత్రకారుల అభిప్రాయం) ఐతే, సమకాలీనంగా ఈనాటికీ అదే న్యాయంగా పాటించడం ఎంత వరకూ సరైందన్న విషయాల్ని ఆలోచించేముందు, అంతకంటే ఎన్నో శతాబ్దాల ముందు నుంచీ హిందూ మతంలో స్త్రీలూ

దళితబహుజనులపై అమానవీయంగా ఆచరింపబడుతున్న నేరాల్ని గురించి ప్రశ్నించగలమేమో పరిశీలించాలి. వందల సంవత్సరాల్నుంచి కులం కారణంగా, వృత్తి కారణంగా, రంగు కారణంగా, రూపం కారణంగా ఊరికి దూరంగా ఉంచబడి, అన్ని అవకాశాలకూ దూరం చేయబడి, పుట్టుక కారణంగా క్రూరంగా తొక్కేయబడ్డ వెలివేత బతుకుల్ని గూర్చి నిజాయితీగా స్పందించేందుకు ముందుకు రావాలి. ఈ రోజుకీ సమాజంలోని అన్ని ప్రధాన పార్శ్వాల్లోనూ, అన్ని ప్రభుత్వ-ప్రైవేటు యంత్రాంగాల్లోనూ అజమాయిషీ చెలాయిస్తూ ఉద్యోగాలు వెలగబెడుతోంది అగ్రవర్ణ హైందవులే కాని వెనకబడిన దళిత బడుగు బలహీన వర్గాలు కావని అర్థం చేస్కుంటేకానీ, వ్యవస్థలో ముస్లిమ్‌ల స్థితేమిటో, అందులోనూ ముస్లిమ్ స్త్రీల గతేమిటో అంచనాకు రాలేం.

తమ నైపుణ్యంతో, కళాప్రచారంతో ఈ దేశపు ప్రజల్నెంతో ప్రభావితంచేసి తరాలుగా మానవీయ స్ఫూర్తిని నింపిన ఏ సూఫీ శాంతి ప్రచారకుడూ, లేక ఏ ఇస్లామ్ తత్వవేత్త గురించయినా మన పిల్లలు చదూకుంటున్నారా? స్వాతంత్ర్యోద్యమంలో ప్రాణాలర్పించిన ఫకీర్లూ, వహాబీలు, ఫరాజీలు, మోప్లాలు, ఖుదా-యె-ఖిద్‌మత్‌గార్లూ, ఖిలాఫత్ ఉద్యమకారులూ యింకా, లెక్కలేనంతమంది ముస్లిమ్ మహనీయుల గురించి మనలో ఎంతమందికి తెలుసు? భగవంతుడ్ని ఒక అనిర్వచనీయ అనుభూతిగా, ఎవరికి వారు వ్యక్తిగత సాధనతో పొందాల్సిన అద్వితీయ అనుభవంగా పేర్కొని, వ్యసనాలకు వ్యతిరేకంగా ప్రజల్లో శాంతి సామరస్యాల్ని ప్రచారం చేస్తూ, సమిష్టి జీవన విధానాన్ని గురించీ - నైతిక నిష్టకు సంబందించిన అవసరాన్ని గురించీ వేలమైళ్ళు కాలినడకన తిరిగి చివరికి సాధువులుగా, బాబాలుగా, దైవస్వరూపులుగా పూజలందుకుని మరణించిన ఎందరో ముస్లిమ్ పెద్దల చరిత్ర వెలికితీయాల్సుంది. ఈరోజు హిందూ ముస్లిమ్‌లనే తేడా లేకుండా పూజలందుకుంటున్న దర్గాలన్నీ, నిజానికి మత సామరస్య ప్రతీకలుగా నిర్మితమైనవే. సుమధురమైన ఉర్దూభాష మొదలుకుని సుమనోహరమయిన మొఘలాయీ వంటకాల వరకూ ఈ దేశపు సంస్కృతీ సంప్రదాయాల్లో ఇస్లామ్ పాత్ర అవిస్మరణీయం. అంతటి గొప్ప చరిత్రను కాషాయంతో విద్వేషపూరితంగా చేయడం, అన్య మతమని నిరసించడం, ఐచ్ఛిక అయిష్టతను పాటించడం అక్రమం, అవివేకం. ఇదిలాగే కొనసాగితే త్వరలోనే ఈ జాతికి తిరిగి తనను తాను పునరుద్ధరించుకోలేనంతగా విచ్ఛిన్నమవు తుందనేది నిస్సంశయం. లౌకిక ప్రగతిశీల శక్తులు సైతం ఈ

అంశంలో కృషి చేయాల్సిన కచ్చితమయిన అవసరం ఉంది. ప్రజాసంఘాలుసైతం ఈ కోణం నుంచి సమస్యల్ని చూడటం అలవర్చుకోవాలి. సిద్ధాంతాలేవైనా ముస్లిముల్ని రెండో తరగతి వ్యక్తులుగా దూరంపెట్టే పరిస్థితులు, నిజానికి సామాజిక ఉద్యమాల్లో భావనిర్మాణంలోని బలహీనతకు తిరుగులేని చిహ్నాలని గుర్తించనంతకాలం మనకి ముందడుగు పడదు.

ముస్లింలు, ముస్లింలుగానే వుంటూ స్వతంత్రంగా - భద్రతతో జీవించగలిగిన పరిస్థితుల్ని నిజాయితీగా కల్పించడంలో పౌరసమాజం విఫలమైనంతకాలం ప్రజాస్వామ్యమనే భావనకు పాక్షిక శక్తులే నిర్వచనల్ని నిర్దేశిస్తుంటాయి. ఇది ఆరోగ్యకర పరిణామం కాదు. మతోన్మాద శక్తుల అఘాయిత్యాల కంటే కూడా, ముస్లిమ్ సమాజంపై ఆ అరాజక శక్తులు చేస్తున్న ప్రణాళికాబద్ధమైన ప్రచారాల్నీ, దాడుల్నీ, కనీసం మౌఖికంగా ఎదురుకునేందుకు కూడా లౌకికశక్తులు ముందుకు రాకపోవడం, మొత్తంగా ఈ విధ్వంసకర పరిణామాల్ని ప్రశ్నించగలిగేందుకు సిద్ధపడకపోవడం, ముస్లిమ్‌లకు నైతిక మద్దతు ప్రకటించేందుకు కూడా వెనకాడటం అప్రజాస్వామికం. సామాజిక న్యాయానికి సంబంధించిన వాదాల్నీ, వివాదాల్నీ కొనసాగించుకోడానికి పాలకవర్గాలు చూపించే ఉత్సుకతలో వెయ్యోవంతైనా దేశంలోని ముస్లిమ్‌ల స్థితిగతుల్ని వాస్తవికంగా అంచనా వేయడానికి చూపించి ఉంటే ప్రస్తుతమున్న రిజర్వేషన్లను ఎక్కువ శాతానికి పెంచడం న్యాయబద్ధమేనని తెలిసుండేది. మదర్సాలు పెట్టుకోవడానికి అనుమతుల దగ్గర ప్రారంభమై, మసీదులు కట్టుకుని ప్రార్థించుకోవడం దాకా అడుగడుగునా విద్వేషశక్తులు సృష్టించే ఎన్ని అడ్డంకుల్ని అధిగమించి ముందుకు సాగాల్సొంటుందో గ్రహిస్తే స్వంత భూమిపై వారు చేస్తోన్న రోజువారీ పోరాటమెలాంటిదో అర్థమౌతుంది. వర్తమాన చరిత్రపై కొద్దిగా అవగాహనున్న ప్రతివ్యక్తీ సామాజిక స్పృహలో భాగంగా ఇస్లాం యొక్క చరిత్రనీ, ఆత్మగౌరవంతో కూడిన ముస్లిమ్‌ల అస్తిత్వాన్నీ యథాతథంగా గుర్తించడం న్యాయం. ఎవరవునన్నా కాదన్నా చరిత్రలో ఇస్లామ్ విప్లవాత్మక పాత్ర చిరస్మరణీయం. పూర్తిగా కాకున్నా ఎంతో కొంత అభ్యుదయ మతంగా యిస్లామ్ గణనీయం. ఇందుకు వ్యక్తిగత యిష్టాయిష్టాలతో నిమిత్తం లేదు. ఎందుకంటే, వ్యక్తులు వెర్షన్ మాత్రమే చెప్తారు, చరిత్ర సాక్ష్యం చెప్తుంది.



# పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?

అసలు పార్టీలనేవి లేకుండా ప్రజాస్వామ్య మనేదెలా సాధ్యమనే ప్రశ్నకు గతంలో ఎంత ప్రాముఖ్యం ఉన్నదో వర్తమానంలోనూ అంతే వుంది. బహుశా భవిష్యత్తులోనూ వుంటుంది. ఐతే, రాజకీయ కార్యకలాపాల గురించిన విధానపరమయిన అభిప్రాయాల్ని ప్రజాస్వామికంగా స్వీకరించే స్థాయికి ఈరోజు మన పార్టీలెదిగాయా అనేదో సమస్య. ఒకవైపు స్వతహాగా ఏదో రకమయిన వ్యక్తిపూజకో ఆచారమనదగ్గ వ్యవహారశైలికో అంకితమవడం ప్రజాసంఘాల భావదారిద్ర్యానికి చిహ్నం. ఒకానొక గొప్ప వ్యవస్థ గురించిన సాధ్యాసాధ్యాల్ని చర్చించుకోవడంలో తప్పులేదు కానీ, అందుకోసం సమాజంలోని తప్పుల్ని కేవలం ఎత్తిచూపడం కాకుండా మన ఆలోచనాత్మకమైన ఔచిత్యాన్ని ఆచరణలో ఎలా స్పందించి ప్రవర్తిస్తున్నామనే దానిపైనే సామాజిక కర్తవ్యం వెల్లడౌతుంది. పురాణాలు మొదలుకుని అన్ని మతగ్రంథాల్లోనూ ఎంతో కొంత ప్రజాస్వామిక భావనలు కనిపిస్తాయి. అందుకోసం పాశ్చాత్య తత్వశాస్త్రాలతో మొదలుపెట్టి క్రీ.పూ. ప్రాచీన కాలంలో జరిగిన చర్చల వరకూ తిరిగి తోడి తీయాల్సినవసరం లేదు కానీ కొద్దోగొప్పో మనకు పరిచితమయిన పరిధుల్లోనే మాట్లాడుకోవచ్చు. నిజానికి కమ్యూనిజం, సోషలిజం, హ్యూమనిజం... మొదలైన భావజాలాలన్నీ క్షేత్రస్థాయిలోని ప్రజా ప్రభుత్వాలకి సైద్ధాంతిక ప్రతిపాదనా రూపాలే. ప్లేటో రిపబ్లిక్ నుంచీ గాంధీ స్వరాజ్ దాకా సామూహిక సహకార స్వామ్యాన్ని అంతకంతకూ స్పష్టం చేసుకునేందుకు జరిగిన ప్రయత్నాలే. మన దేశంలో తలెత్తిన సాంఘికోద్యమాలన్నింటికీ ఉమ్మడి స్ఫూర్తి ఇదే

అయినప్పటికీన దీనికో క్షేత్రస్థాయి రూపమిచ్చేందుకు ప్రయత్నించినవారిలో ఎమ్.ఎన్. రాయ్, ఎమ్.కె. గాంధీ, జయప్రకాశ్ నారాయణ, నరేంద్రదేవ్, రామ్‌మనోహర్ లోహియా ముఖ్యమయినవాళ్ళు. వీరి భావాల్ని అర్థంచేసుకోడంలో జరిగిన చారిత్రక లోపాల వలనే వీరందర్నీ మన భావాలకనుగుణంగా కుదించుకుని చదూకోడంతో సరిపెట్టుకుంటున్నామే కాని, ఆయా భావజాలాలకి మూలమయిన సారాన్ని సమగ్రంగా గ్రహించడంలో యింకా వెనుకబడే ఉన్నాం[1]. మార్క్స్ సాంఘిక సిద్ధాంతాన్ని ఆర్థికతకే పరిమితం చేసుకోవడమెంత లోపమో, మానవేంద్రనాథ రాయ్ మానవ వాదాన్ని వ్యక్తికే అన్వయించుకోడం కూడా అంతే దోషం. గాంధీ అభిప్రాయాల్ని గుడ్డిగా ఆరాధించడమెలా లోటో, అంబేద్కర్ ఆలోచనల్ని పిచ్చిగా పూజించడమలా తప్పు. దౌర్భాగ్యమేంటంటే, ఆనాడు తప్పనిసరి పరిస్థితుల్లో ఆయా భావాలతో ప్రజల్ని ప్రభావితం చేయచూసిన వారి పేరు చెప్పి, విగ్రహాలు కట్టి, సంఘాలు పెట్టి వారి ఔన్నత్యాన్ని దిగజార్చే విద్వేషాల్ని సమాజంలో రగుల్కొలిపేందుకు ప్రయత్నించడం. ఆనాడు సాంఘిక సంక్షేమం కోసం కనీసం కొంతమేరకైనా ఆయా మహానుభావులు కలిసి పనిచేసేందుకు ప్రయత్నించి ఆ దిశగా ముందడుగేయగా, ఈరోజు వారి ఆలోచనా విధానంతో పనిచేస్తున్నామని ప్రచారం చేసుకుంటున్న వ్యక్తులు స్వలాభం - స్వప్రయోజనాలు - స్వార్థం కోసం యితరేతర సంస్థలతో శత్రుపూరిత వైఖర్ని పాటిస్తూ, భావితరాలను ఆ దిశగా ప్రోత్సహిస్తూండటం దారుణం. ఈ దేశంలో విభిన్నమైన పార్టీరహిత ప్రజాస్వామ్య పద్ధతులకు సమకాలీన ప్రతీకలుగా నిలిచిన గాంధీ, రాయ్‌ల వాదాల్ని సమన్వయం చేసేందుకు ప్రయత్నించినవాడు జయప్రకాష్ నారాయణ్. జె.పి. సర్వోదయ అలా ఆవిర్భవించిందే?[2] దేశంలోని

---

1. చూడు, సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా (Towards a Fuller Democracy) మూలం : జయప్రకాష్ నారాయణ, అనువాదం : గౌరవ్, సెంటర్ ఫర్ డెమోక్రటిక్ సొసైటీ ప్రచురణ - 2015, అలాగే ఇంకా సమకాలీన సమాజం ప్రజాశక్తే జవాబు. మూలం : బీరేంద్ర భట్టాచార్య, అనువాదం : శ్రీ పి. సుబ్రహ్మణ్యం, ప్రచురణ : జె.పి. శతజయంతి ఉత్సవ కమిటీ, విశాఖపట్నం - 2002.

2. ఈ విషయంలో చాలామంది రాయిస్టులకు భ్రమలున్నాయి. తెలుగునాట ప్రసిద్ధ హేతువాద తత్వవేత్తయిన రావిపూడి వెంకటాద్రిగారు ఎంతో శ్రమకోర్చి చేసిన అద్వితీయ రచన 'ఎమ్.ఎన్.

అనేక ప్రాంతాల్లో ఈ ఆలోచనలకు అనుగుణంగా వివిధ సంఘాలు - సమాఖ్యలు రూపొంది, వివిధ రూపాల్లో, పలు మార్గాల్లో కృషి చేయడం జరిగింది. ఎప్పుడైతే నాయకులు వెనకడుగేసి పొరపాటు చేసారో అప్పుడిక స్వతంత్రంగా ముందుకెళ్ళేందుకు అవి పెద్దగా ప్రయత్నించలేదు. స్వాతంత్ర్యానికి ముందు నుంచే అధికారం కోసం ఆత్మగౌరవానికి తిలోదకాలిచ్చిన నాయకమ్మణులకు భిన్నంగా అసలు ఆలోచనలకూ, ఆచరణకూ అధికారంతో సంబంధం లేదని తమ జీవితంతో నిరూపించిన యోధుల్ని సైతం ఈరోజు ఇష్టమొచ్చినట్లు ఉ

---

రాయ్ భారత కమ్యూనిజం' ఉపోద్ఘాతంలోనే "...(రాయ్) ప్రత్నామ్నాయ విధానాన్ని అన్వేషించి, 1948లో పార్టీరహిత ప్రజాస్వామ్యాన్ని ప్రతిపాదించాడు. అందలి ఔచిత్యాన్ని గ్రహించిన సర్వోదయ నాయకుడు జయప్రకాష్ నారాయణ పార్టీరహిత ప్రజాస్వామ్య నినాదాన్ని అందుకొని విశేష ప్రచారమిచ్చాడు. రాయ్ పేరు చెప్పకుండా రాయ్ వాదానికి ప్రచారమిచ్చిన మొదటి జాతీయ వాది జె.పి...' అంటూ, భారత ప్రజాస్వామ్యం ప్రమాదంలో ఉన్నదని తన చివరి రోజుల్లో జె.పి. గ్రహిస్తే గాంధీవాదానికి సంబంధించిన రోగనిర్ణయాన్ని రాయ్ 40 సం॥ ముందే చేసారంటారు రచయిత. జె.పి. 'సంపూర్ణ విప్లవం' రాయ్ 'కింది నుంచి విప్లవానికి' అనుసరణేనంటూ, "... భౌతిక వాస్తవికవాద ధోరణిని అవలంభించడంలో రాయ్ చూపిన సాహసాన్ని జె.పి. చూపలేక పోయాడు. అందుకు తగిన తాత్విక పరిధులు జె.పి. కి అందకపోవడమే కారణమేమో! లేక ఎదురీతకు జంకాడో!" అనేసారు (చూడు-17, 18). అదే గ్రంథంలో, "జె.పి. నాసిక్ జైల్లో వుండగా ఏర్పాటు చేసిన సోషలిస్టు గ్రూపులో రాయ్ అనుయాయుడు ఛార్లెస్ మస్కారెన్‌హాన్ కూడా వున్నాడు. నిజానికి జె.పి. అమెరికాలో వుండగానే (1920) రాయ్ రచనలవల్ల ప్రభావితుడైనాడు. రాయ్ రచనల నుంచే మార్క్సిజం వైపు మొగ్గాడు. రాయ్ గ్రంథాలను 'అద్భుతమైనవి' (Masterly Exposition) గా వర్ణించాడంటారు. (చూడు; ఎం.ఎన్. రాయ్ భారత్ కమ్యూనిజం, రావిపూడి వెంకటాద్రి, ప్రజాస్వామ్య ప్రచురణలు 1983, పేజి 372, 373).

3. కానీ వెంకటాద్రిగారు పొరపాటు పడ్డారు. జె.పి. 'Swaraj for the people' రచనకి రాసిన ముందుమాటలోనే. "The other statment is in regard to my omission to mention in my paper the significant and seminal contribution of the late Mr. M.N. Roy to the body of thought with which I am dealing. This has been seriously misunderstood in circles from which I had every right to expect substantial support. Those among them who are acquainted with me and I do count several friends in those circles – Know well the influence of Roy on the evolution of my thought and the high regard in which I have always held him even I have found it difficult sometimes to agree with him. I believe there is no need for me to

ప్రయోగించుకోడానికి మించిన నైచ్యం మరోటి లేదు[3]. పార్టీరహిత ప్రజాస్వామ్యాన్ని గురించి చర్చించేందుకు అర్హతుండాలంటే, కనీసం పార్టీల్లో ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించుకోవాలి. పార్టీల మధ్య సమతాభావనల్ని పెంపొందించుకోవాలి. పార్టీల్లోని అంతర్గత ప్రజాస్వామ్యానికి పెద్దపీట వేయకుండా, వివిధ పార్టీల నడుమ ప్రజాస్వామ్య విధానాలకి తెరతీకుండా, అసలు పార్టీసహిత పద్ధతిలోనే మార్పుకోసం నిజాయితీతో కూడిన ప్రయత్నం చేయకుండా ఇంతకంటేమంచి వ్యవస్థ గురించిన ఆలోచనలకు ఒక రూపు నివ్వడం పూర్తిగా సాధ్యం కాదు. ఈరోజు అప్రజాస్వామికతనేది సమాజంలోని ప్రతి వ్యక్తీ ప్రతి సంస్థా ఎదుర్కొంటున్న అతి పెద్ద సమస్య. అప్రయత్నంగానే మనుషుల్లో ఈ లక్షణం ఉన్నది. ఆధునిక సమాజం ప్రయత్నపూర్వకంగా వొదిలించుకోడానికి ఎంతోకాలంగా కృషి చేస్తున్నప్పటికీ, ఈనాటికీ యింకా మానవాళిని పట్టిపీడిస్తోందీ దుర్గుణం. మానవాళి ఎదుర్కొంటున్న సమస్యలన్నింటికీ ప్రత్యక్షంగానో - పరోక్షంగానో ఇదే కారణం. భారతదేశంలోని కులసమస్య, మత ఘర్షణలు, లింగవివక్ష, అవినీతి, అసూయ, అవిద్య, నిరుద్యోగం, అహంకారం... లాంటి వాటికన్నింటికీ ఆయా క్షేత్రాల్లోని నిబిడీకృతమైన అప్రజాస్వామిక భావనే కారణం. వ్యక్తిగత స్వార్ధానికి లోతైన పరాకాష్టగా భావించగలిగే ఆంతరిక అసమానతా దృక్పథమే వ్యవస్థలోని అప్రజాస్వామిక విధానాలకు ప్రధాన కారణం. రాయ్ సహకారస్వామ్యంలోని పరస్పర ప్రజాస్వామ్యం, గాంధీ దేశ నిర్మాణంలోని గ్రామ స్వరాజ్యం ఈ దిశగా చెడుగుల్ని తొలగించేందుకు కిందిస్థాయి నుంచి జరిగిన శ్రమలో గణనీయమైన భాగాలే. జె.పి. సంపూర్ణ విప్లవం నుంచి సర్వోదయ వరకూ, లోహియా సోషలిజం మొదలుకొని వినోభా భూదానోద్యమం దాకా

---

add that at no time have I claimed to have made an original contribution to Political thought" అంటూ "I am indebted not only to Roy, but to many others most to Gandhiji. At the same time I must also make it clear that no one else but myself should be held responsible for the ideas I had expressed in my original paper or am about to do now" అని ముగిస్తాడు. చూడు; Swaraj for the people, Jayaprakash Narayan, Published by Sarva Seva Sangh Prakashan, Rajghat, Varanasi - 2013. ఇటువంటి పొరపాటు అవగాహనతోనే నేను కూడా కొన్ని సందర్భాల్లో రాయ్‌ని చులకనచేసి రాయడం జరిగింది. అది నా తప్పే.

అనేక దిశల్లో ఒకే లక్ష్యంతో జరిగిన అపూర్వ ప్రజాస్వామిక రూపాలే అగుపిస్తాయి. ఈ క్రమంలో గ్రామాభివృద్ధికి ప్రాధాన్యతనిస్తూ సమిష్టి జీవన విధానాన్ని అవలంభిస్తూ స్థానిక పరిశ్రమల్ని బలోపేతం చేసుకొంటూ, శారీరక శ్రమతో కూడిన సహజసిద్ధమయిన వ్యసనాలకతీతమయిన బతుకు చిత్రాన్ని గాంధీ చూస్తే, హేతుబద్ధమైన వైజ్ఞానిక సరళితో మమేకమయిన పరస్పర సహకారపూరిత సామరస్య సృజాతన్మక సంఘ నిర్మాణాన్ని రాయ్ ఆవిష్కరించాడు. ఇక అంబేద్కర్, లోహియాలు సైతం అమానవీయమయిన వివక్షలకు విరుద్ధమయిన సమతా వ్యవస్థను ఆశించినవారే. వీరందరూ ఏదో పార్టీతో సంబంధం కలిగి, చివరికి తమ భావాల్ని అభివృద్ధి చేసుకున్నవారే. లెక్కలేనన్ని సంస్థలు, పార్టీలు, లెక్కకుమిక్కిలిగానున్న నాయకులతో గల ప్రస్తుత వ్యవస్థలో ప్రత్యామ్నాయ ప్రయత్నాల్ని కొనసాగించడమెంత ముఖ్యమో, ప్రత్యామ్నాయ జీవిత విధానాల్ని అన్వేషించడం, అందుకోసం ముందు తరాల మేధావుల యోచనారీతుల్ని నిబద్ధతగా అధ్యయనం చేయడం కూడా అంతే ముఖ్యం. అణగారినవారి అభ్యున్నతి కొరకు జరుగుతోన్న అస్తిత్వోద్యమాల గురించిన సరైన ప్రాతిపదికను వాస్తవికంగా అంచనా వేస్తూనే, వ్యక్తిగతంగా వీలైనంత శ్రమించడానికి ప్రయత్నిస్తూ, సామాజికాంశాల్ని అధ్యయనం చేయడంతోపాటు యితర ప్రజాసంఘాలతో సంబంధాలు పెట్టుకోవడం, వాటి భావజాలాల్ని ప్రాపంచిక దృక్కోణంతో హేతుబద్ధంగా పరిశీలించడం సామాజిక స్పృహ కలిగి, నేటి స్వార్థపూరిత, అప్రజాస్వామిక పార్టీస్వామ్యానికి ప్రత్యామ్నాయంగా పార్టీరహిత ప్రజాస్వామ్యాన్ని కోరుకుంటున్నవారందరి కర్తవ్యం. వైయక్తిక వైఖరే వైజ్ఞానిక వైష్లవీకరణకూ, సాంఘిక న్యాయానికి ప్రమాణంగా భావించబడేటప్పుడు అనివార్యమయిన సందిగ్ధంలో ప్రత్యామ్నాయోద్యమాల్లో ఏదో విధంగా భాగం కావడమే అంకితభావానికి ప్రాతిపదిక అవుతుంది[4]. అందుకోసం ముందుకొచ్చే వారందరికీ విధిగా సమతావ్యవస్థను గురించిన పూర్తి స్వరూపం స్పష్టంగా వుండాలనేమీ లేదు కానీ, ఆ వైపుగా చేసే ప్రయత్నాల సారం అంతకంతకూ ఆలోచనాస్పష్టతకు దారితీయలేకపోతే శుద్ధమయిన ఆచరణకు అత్యంత

4. చూడు; యిదే రచయిత రచన 'హేతువాద దృక్పథం - విధానపర కర్తవ్యం'లోని 'నాగరిక దృక్పథాలు - మానవీయ పంథా' పేజి-50, జనవికాస వేదిక ప్రచురణ - 2015.

పరిమితమైన ప్రయోజనం మాత్రమే ఉంటుందనడంలో సందేహం ఉండనక్కర్లేదు. ఆధునిక వ్యవస్థ ఆవిర్భవించిన నాటినుంచీ, సామ్యవాద సంబంధిత సిద్ధాంతాల అభివృద్ధి రాటుదేలింది. అరాజకత్వంతో (Anarchism) ప్రారంభమైన అహింసా స్వరూపం నిర్మాణాత్మకమయిన కార్యక్రమాలపై దృష్టిపెట్టింది. నకిలీ ప్రజాస్వామ్య వ్యవస్థల గురించిన తిరస్కార భావనలు, నాటకీయ పార్లమెంటరీ విధానానికి సంబంధించిన అసహన పరిణామాలు ప్రజాస్వామ్యమనే దృక్పథానికి మరింత నిశిష్టతను చేకూర్చాయి5. దురదృష్టకరమైన విషయమేమంటే, పార్టీల మధ్య, చీలికల సమయంలో లేదా అవినీతి సందర్భాల్లో ఉచ్ఛరించబడినంతగా ప్రజాస్వామ్య భావన, ప్రజల దైనందిన వ్యవహారాల్లో పార్టీల అంతర్గత నిర్మాణంలో సమస్యల సంవాదాల్లో దార్శనికంగా ఉపయోగపడ్డం లేదు.

---

5. నా మొదటి రచనలో నేను (ప్రజాస్వామ్య పతనం) ప్రభుత్వాన్ని వేశ్యతో పోల్చి ఎలాగైతే రాసానో అదే తరహా ఆలోచనల్ని పార్లమెంటుని వేశ్యతో పోలుస్తూ గాంధీ 'హింద్ స్వరాజ్'లో రాసారు. ఏదేమైనా స్త్రీని కించపర్చే అలాంటి పోలికలపట్ల యిప్పుడు నాకు వ్యతిరేకత ఉంది. చూడు, ప్రజాస్వామ్య పతనం, అరాజకత్వ అధ్యయన కేంద్రం ప్రచురణ, పేజి-7, Hind Swaraj or Indian Home Rule by M.K. గాంధీ, నవజీవన్ ప్రచురణ - 1938, పేజి-27, అంబేద్కర్ సైతం ఈ నిజాన్ని గ్రహించడం వల్లనే, రాజ్యాగం అమలులోకి వచ్చిన రోజునే, "... ఇప్పటిదాకా మనం సాధించింది రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే కాని ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యం సిద్ధించాల్సి ఉంది. అవి రానంతవరకూ, మనం కష్టపడి నిర్మించుకున్న ఈ పార్లమెంటరీ వ్యవస్థ పునాదులకు ప్రమాదం తప్ప"దన్నాడు. చూడు... కదిలేదీ... కదిలించేదీ... డా॥ ఎ.బి.కె. ప్రసాద్ వ్యాసాలు, సాహిత్యకీయాలు (1969-2010)లో అంబేద్కర్ గాంధీ 'పూనాసంధి' పున: పరిశీలన అవసరమా? పేజి 278, బసవేశ్వర ప్రచురణలు - 2010. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల విలువను గూర్చి ఘోషిస్తూ 'Socialism to Sarvodaya' రచనలో జె.పి. "Freedom had become a passion of life and I shall not see it comprimised for bread, for power, for security, for prosperity, for the glory of the State or for anything else" అంటాడు. "ఆధునిక ప్రజాస్వామ్యమొక ప్రొద్దుతిరుగుడు పువ్వు, ఆధునిక ప్రజాస్వామ్యమొక సానిదాని నవ్వు, ఆధునిక ప్రజాస్వామ్య మొక ప్రాస్టిట్యూట్, ఓటు దానిగేటుకు చెల్లించే రేటు" అంటాడు కదా సి.వి. తన విశాల భారతంలో. అలాగే సురేంద్ర మోహన్ రాసిన 'Socialism in our Time' అనే చిన్న పొత్తంలో గాంధీ రాయ్, మార్క్స్, జె.పి. విధానాలకు సంబందించిన పార్టీరహిత ప్రజాస్వామ్య పద్ధతుల్ని గురించిన చర్చనీయ విషయాలున్నాయి. వివరాలకు, (చూడు : Socialism in our time, by Surendra Mohan, Visudhaiva

ముఖ్యంగా కుటుంబ వ్యవస్థలో రాని మార్పుకోసం సామాజిక వ్యవస్థలో విఫలయత్నం చేయడం వృధా. వ్యక్తిగత వ్యవహార శైలిలో దురహంకారానికి తావిస్తూ, ఇంట్లోని స్త్రీలపైనా పిల్లలపైనా ఆధిపత్యం చెలాయిస్తూ, ఊర్లోని దళిత బహుజన మైనార్టీలని యింకా ప్రధాన స్రవంతికి దూరంచేసి వివక్ష చూపిస్తూ, ఆంతరికమయిన అహంభావాన్ని మానసికంగా పెంచుకొని దాన్నే ఎదురులేని వ్యక్తిత్వానికి తిరుగులేని సంకేతంగా భ్రమిస్తున్నంతకాలం సామాజిక రంగంలో జరిగే ప్రయత్నాల ఫలితం శూన్యమే. భావజాల క్షేత్రాల్ని బలోపేతం చేస్తూ క్షేత్రస్థాయిలో వీలైనంత విస్తృతంగా, లోతుగా ఆచరణాత్మక కార్యక్రమాల్ని నిర్వహించుకోవడం ప్రత్యామ్నాయ ప్రజా ఉద్యమాల విధి. ఏ విధమైన ప్రజాస్వామిక ప్రయత్నాలకైనా ఇదే పద్ధతి. పార్టీరహిత స్వామ్యం కూడా ఇందుకు మినహాయింపు కానేకాదు.



---

Kutumbakam, New Delhi, IInd Edition - 2002) 4 వ్యాసాలున్న ఈ కరపత్రంలో చివరి రెండు వ్యాసాలూ, Relevence of Karl Marx and Gandhi in 21st Century, Power to the people వ్యాసాల్లో ఈ అంశాన్ని చర్చించడం జరిగింది. "Thus Gandhi, Roy and JP converged on the issue that there should be people's power rather than the power of political parties or the state" అంటారు (పేజి-18). అలాగే మధ్యయుగాల్లో కబీరు కూడా 'బేగమ్‌పురా' అనే శ్రేయోరాజ్యాన్ని ఊహించినట్లు తెలుస్తోంది. చూడు, Begumpura; Exploring Political ideas of Kabir, Himanshu Roy, frontier, November 2015.

# ఐచ్ఛిక అలసత్వం - స్వచ్ఛంద బానిసత్వం

అన్ని సామాజికోద్యమాలకు కాలం చెల్లిందనే ప్రచారం గత కొన్ని దశాబ్దాలుగా నిర్విరామంగా జరుగుతోంది. గతంలో పనిగట్టుకుని పాలక వర్గాలు చేసిన ఈ ప్రచారాలని ఇప్పుడు ఏ పనీలేని నిరుద్యోగులతో మొదలెట్టి, అనేక పనుల్లో మునిగి తేలిపోయే సెలబ్రిటీలదాకా అంతా చేస్తున్నారు. మన గురించీ, మన కుటుంబం గురించీ తప్ప మిగిలిన సంగతుల్ని గురించి పట్టించు కోకుండా వుండటమే సభ్యతగా చలామణీ అవుతోంది. సమాజంపై నిరంతరాయంగా పెరుగుతోన్న ప్రసారమాధ్యమాల ఒత్తిడికి తలొగ్గిన ఎక్కువశాతం ప్రజలు వారి జీవితాల్లోని ఎక్కువ సమయాన్నీ - వనరుల్నీ మార్కెట్ శక్తులకు ధారపోయడానికే వెచ్చిస్తున్నారు. మంత్రతంత్రాల్నీ, యంత్రభూతాల్నీ పూజిస్తూ మానవ సంబంధాల్నీ, ప్రకృతి వనరుల్నీ నాశనం చేసుకుంటున్నారు. సహజసిద్ధంగా మనకుండాల్సిన మానవీయ జీవన స్పందనలు సైతం నాగరిక సుఖాల మాయలో పడి మరుగైపోయే పరిస్థితి దాపురించాక యింకా అక్కడక్కడా మిగిలున్న ఉడతాభక్తి ఉద్యమ సంఘాల ఉలికిపాటు సవ్వడుల్ని చూసి సంతోషించాల్సిన దౌర్భాగ్యం నడుస్తోంది. ప్రశ్నించాల్సిన ప్రతీ సందర్భాన్నీ ప్రయత్నపూర్వకంగా అనుసరించడానికే అనుసంధానించడంతో సొంతాలోచననేది చచ్చుబడిపోయి, భావబానిసత్వం రంకెలు వేస్తోంది. వ్యవస్థలో పెట్రేగిపోతోన్న ఆకలిచావుల్నీ, అసమానతల్నీ, నిర్లక్ష్యపు నీడల్ని, నిరుద్యోగ గోడల్ని,

అసహాయులపై దాడుల్ని, ఆధిపత్య వాదాల్ని, మతమౌఢ్యాన్నీ, కులక్రౌర్యాన్నీ, లింగ వైరాన్నీ, వర్గపోరాటాల్నీ, చూడకుండా మన ఎదుగుదలనో, ఒదుగుదలనో వూహించుకుని తోచిన కథలల్లుకుని గాల్లో మేడలు కట్టడం వల్ల ప్రయోజనం లేదు. భావ-భౌతిక బానిసత్వాలు రెండూ అంతం కాకుండా ఈ దేశంలోనే కాదు, ఏ దేశంలోనయినా సంపూర్ణ ప్రజాస్వామ్యం సాధ్యపడదు. సామాజిక సమస్యలపై, సాంఘిక అక్రమాలపై స్పందించలేని నిర్లిప్తవైఖర్ని నిర్లజ్జగా ప్రదర్శించుకోవటమే నాగరికతగా అమలవుతోన్న ఈ కాలంలో, ఆ ఐచ్ఛికమైన అలసత్వానికి మంగళంపాడే తరాలొచ్చినప్పుడే స్వచ్ఛంద దాసత్వాన్ని ధ్వంసం చేసేందుకు వీలు కుదురుతుంది. కొన్ని సంవత్సరాలపాటు ఒకే రకమైన తిరోగమన భావజాలాన్ని రుద్దడం వల్ల ఈనాటి యువత కూడా పురోగమన ఆలోచనల్ని అంత త్వరగా ఆహ్వానించే స్థితిలో లేరు. సమిష్టి సంతోషానికి దారి చూపించాల్సిన విద్యావకాశాలు, వ్యక్తిగత స్వార్థానికి కేంద్రంగా మారడం వల్ల, విశాలమైన విశ్వజనీన దృష్టిని ప్రసాదించాల్సిన పాఠ్యపుస్తకాలు, తరగతి గదులూ సంకుచితమైన అహంకారాన్ని పెంపొందిస్తున్నాయి. దేశంలోని 20% మంది ప్రభుత్వ-ప్రైవేటు ఉద్యోగుల, ఇతర వ్యాపారస్తుల అవసరాలపై ఆధారపడి మాత్రమే మార్కెట్ తన సరుకుల్ని తయారుచేయడం జరుగుతోంది తప్పితే అత్యధికశాతం మందిగల పేద, మధ్యతరగతి జనాల్ని దృష్టిలో పెట్టుకుని కాదు. అందుకనే దేశంలోని ఎక్కువమంది వారి యదార్థ జీవన స్థితిగతుల్ని కప్పిపుచ్చుకుంటూ, తాము కూడా తక్కువ కాదని అందరికీ తెలియజేసే ప్రయత్నాన్ని తీవ్రంగా చేయబట్టే, సెల్‌ఫోన్లూ, ఐపాడ్లూ, ట్యాబ్‌లు, బైకులు, కార్లు, సౌందర్య సాధనాలు, ఖరీదైన యితర వస్తువులు ఇంతెక్కువ స్థాయిలో అమ్ముడవుతున్నాయి. కార్పొరేట్ సంస్థలు విసురుతున్న గేలాలకు మన దేశ యువతీయువకులు బిత్తరపోతూ చిక్కుకొంటున్నారు. వ్యవస్థకొచ్చిన వ్యాధుల్ని వొదలగొట్టడానికి ప్రయాణం మొదలుపెట్టని బలహీన మనస్తత్వాలు, నాగరికత పేరిట అనాగరిక రోగాల్ని తలకు చుట్టుకుని గిలగిలలాడుతున్నాయి. ఒకవైపు సరికొత్త జబ్బుల్ని బొత్తిగా బాధ్యతలేని వాతావరణాన్ని కల్పించుకుని మరీ తెచ్చుకోవడం కోసం పార్టీ - ఫంక్షన్ల సంస్కృతికి స్వీకారం చుడుతోంటే, మరోవైపు నామమాత్రపు సౌకర్యాలు, కనీస వసతులు కూడా కరువైన కోట్లాదిమంది జనాలు

కష్టాల్లో కాలం వెళ్ళబుచ్చుతున్నారు. మన చదువు, ఉద్యోగం, సుఖం, అన్నీ మన జీవితంతో ఏమాత్రం సంబంధంలేని వేరెవరో నిర్ణయించడం జరుగుతోంది. ఉదాహరణకి ఉద్యోగం కోసం విద్యా, వివాహం కోసం ఉద్యోగం, పిల్లల కోసం వివాహం... యిలా ఒకదాని కోసం మరోదానితో రాజీపడటం అలవాటైపోయి, మొత్తంగా మన జీవితం మనకే పరాయిదైపోయి మనది కాకుండా పోతోంది. 'ఖాళీగా వుండడ'మనే పదం పరమ బూతైపోయి సంపాదన వెంటబడకుండా, నాగరికత వెంబడి పరుగెత్తకుండా సాదారణంగా కుదిరినంత సామాన్యంగా జీవించడానికి ప్రయత్నించడమొక అసాధ్యమయిన విషయంగా, అగౌరవానికి చిహ్నంగా కనిపిస్తోంది. జనాభాలో అతికొద్దిమంది మాత్రమే అనుభవించగలిగే విలాసాల్ని ఆరాధనాభావంతో చూసే మనస్తత్వాన్ని ప్రజల్లో పెంపొందించడం వల్ల, స్వీయ మానసిక సంక్షోభానికి అది కారణమై, మూఢత్వంగా మారి అందరికీ సమానవకాశాలు కావాలన్న నిజాయితీతో కూడిన ప్రజాస్వామిక ఆకాంక్ష కంటే వీలైనన్ని ఆడంబర సుఖాల్ని ఎవరికి వారు వ్యక్తిగతంగా అనుభవించాలన్న అప్రజాస్వామిక దురాశ పెరిగి చివరికి దుఃఖానికి చేటవుతోంది. ఇందువల్ల సాంఘిక, కుటుంబ విలువలన్నీ దెబ్బతిని కపట సంబంధాలే రాజ్యమేలుతున్నాయి. ఈరోజు పసిపిల్లలు మొదలుకుని, ముసలివాళ్ళపై వరకూ యదేచ్ఛగా పశుత్వంతో కూడిన అత్యాచారాలు జరుగుతున్నాయంటే 'వసుధైక వ్యవస్థ'నే భావన సమాజంలో లోపించడం ప్రధాన కారణం. మొబైల్, స్మార్ట్‌ఫోన్, టాబ్, కంప్యూటర్, లాప్‌టాప్... యిలా రోజులో ఎక్కువ కాలాన్ని కృత్రిమమయిన తెరల ముందు గడపడానికే ఆసక్తి చూపుతున్న యువతరం అంతిమంగా అప్రమేయంగానే అవాంఛనీయమయిన ప్రమాదకర ఆకర్షణలకి ఎరగా మారుతున్నారనే నిజం గుర్తించేసరికే ఆలస్యమవుతోంది. ప్రజాస్వామ్యమనే విలువను ఆధునిక మానవీయ నాగరిక దృక్పథంతో తలెత్తిన ఉన్నతమయిన ప్రజాతంత్ర భావనగా కాక, కొద్దిమంది పెద్ద మనుషుల అభిప్రాయాలలో అప్పుడప్పుడూ తలెత్తే అరుదైన గౌరవనీయ పదంగా అర్థం చేసుకోవడం వలన సమానత్వమనే లక్షణం ఎవరికి వారు ఎదుటివారిని ప్రమాణంగా చేసుకుని ఏర్పర్చుకోవలసిన రాజ్యాంగ బద్ధమయిన లక్ష్యంగా కాకుండా, అప్పుడప్పుడూ ప్రజల్ని ఏమార్చడం కోసం అసాంఘిక శక్తులు ఉపయోగించే పన్నాగంగా మాత్రమే

అమలవుతోంది. నవీన మానవ సమాజం నుంచి విడదీసి ప్రత్యేకంగా ప్రజాస్వామ్యం అనే భావనేదీ ఉండదు. ప్రతీ మనిషికీ ఒకే విలువనే సూత్రంతో పాటించబడే ప్రజాస్వామిక పంథా, అదే కాలంలోనయినా సమానత్వమనే విలువనే సాధనంగా చేసుకుంటుంది. కొద్దోగొప్పో ఈరోజు అస్తిత్వంలోనున్న ఉద్యమ క్షేత్రాలన్నీ, ముందుగా క్షేత్రస్థాయిలో ప్రజాస్వామ్య భావనను వ్యక్తిగతంగా - వ్యవస్థాగతంగా జీర్ణించుకుని నవీన అభిప్రాయాలతో కూడిన నైతిక, సాంస్కృతిక మానవీయ మార్గాల్ని మనస్ఫూర్తిగా స్వాగతించగలిగినప్పుడే ఆయా ధోరణులకు సంబంధించిన సామాజిక కోణాల్ని వైరాలకతీతంగా వ్యవస్థలో ప్రవేశపెట్ట గలుగుతాయి. అలాంటప్పుడు మాత్రమే కొంతమంది విలాసాల కోసం ఖర్చుచేయబడుతున్న ప్రాకృతిక - మానవ వనరులు సర్వమానవాళి కోసం వెచ్చించబడతాయి. ఈ దేశపు భౌగోళిక, తాత్విక, ఆత్మిక చరిత్రను హేతుబద్ధంగా తెల్సుకున్నప్పుడు మాత్రమే ఈ మార్పు సాధ్యమౌతుంది. ఇందుకోసం ముందు వ్యక్తిగత అలవాట్లతో మొదలెట్టి అనేక విధాలుగా విభిన్న వైఖరుల్ని గూర్చి అన్వేషించాలి, అధ్యయనం చేయాలి, అవిశ్రాంతంగా శోధించాలి, విమర్శనాత్మకంగా చర్చించాలి, క్షేత్రస్థాయిలో పయనించాలి... అప్పుడు మాత్రమే ఏది సరైందనే విషయం అవగతమై అవాంతరాల్నధిగమించగల్గుతాం.



# అరచేతి న్యాయం -
# తలవెంట్రుకల తర్కం

అనాదిగా ఈ దేశంలోని ఆధిపత్య భావజాలానికి భాష కూడా గొప్ప మాధ్యమంగా వుపయోగపడుతోంది. ఒళ్ళొంచి పనిచేస్తూ అగ్రవర్ణాల వారికి ఐదువేళ్ళూ నోట్లోకెళ్ళగలిగేలా చేస్తున్న అణగారిన ప్రజల్ని జీవితాంతం బానిసలుగా ఉంచడానికి పనికొచ్చే అరచేతి న్యాయాన్నీ, తలవెంట్రుకల తర్కాన్నీ చాలా తెలివిగా ఉ పయోగిం చడం జరుగుతోంది. అరచేతిని మించిన ఉదాహరణ అగ్ర వర్ణాలకూ, తలవెంట్రుకలని తలదన్నే తర్కం మన తత్వవేత్తలకూ ఇన్ని రోజులుగా కనబడలేదు కాన ప్రపంచంలోని ఏ ప్రాంతాన్ని మార్చగలిగిన నాగరిక భావజాలమయినా ఈ దేశంలోకొచ్చేటప్పటికి కులం బారినపడి కుక్కమూతిపిందెలా మిగిలిపోవాల్సిందే. కులతత్వం గురించిన ఆధిపత్య భావన మనల్నెంతగా పెనవేసుకుపోయిందంటే, ఆధునిక భావాల వెలుగులో నిర్మిత మయిన ఏ ఉద్యమమూ కూడా ఈరోజు అసమానతా ఆలోచనల్నుంచి తప్పించుకోలేకపోయింది. ఆత్మగౌరవోద్యమంగా చెప్పుకునే దళిత బహుజన మహిళా ఉ ద్యమాలు సైతం దార్శనిక దృష్టితో ప్రజాస్వామిక పద్ధతికి కట్టుబడుండాల్సిన స్వతంత్రాలోచనా సమూహాలుగా కాక, మాటలకూ, చేతలకూ పొంతనలేని సొంతాహంకారంగల కొంతమందితో కూడిన ముఠాలుగా సంకుచిత వర్గాలుగా మిగిలిపోతున్నాయి. వ్యవస్థకిది అనారోగ్య కరమైతే, ప్రజాస్వామ్యానికి ప్రమాదకరం. ఈ పరిస్థితిని సమీక్షిస్తూ, మార్పుకోసం జరిగే యత్నాల పట్ల విమర్శనాత్మక విశ్లేషణ వొక నిరంతర కర్తవ్య ప్రక్రియ. అందులో భాగమే ఈ క్రియ. సెలవు.



మానవ సంస్కారోద్యమాలు తప్పనిసరిగా దృష్టిపెట్టాల్సిన ఒక అనాగరిక లక్షణం అసూయ. మానవ స్వభావంలో అంతర్లీనంగా ఈ అసహిష్ణుత సృష్టించే విధ్వంసంతో పోలిస్తే అణ్వాయుధాలు కూడా ఎందుకూ కొరగాకుండా పోతాయి. జలసీని జయించడానికి జనావళి చేసిన ప్రయత్నాల తాలుకు చిహ్నాలే ఈనాటి మానవ విలువలు. సత్యం, శాంతి, నీతి, అహింస, ప్రేమ, కరుణ మొదలగునవి సమాజంలోకి అలా ప్రవేశించినవే. చింతించాల్సిన సంగతేంటంటే ఈ గుణాలన్నింటిని గుత్తకు తీసుకున్నట్లు ప్రచారం చేసుకొనే నాగరిక వ్యవస్థ ఆదర్శాల్ని ఆధునిక భాషలో వల్లెవేస్తూ ఆచరణలో మాత్రం ఘోరంగా విఫలమవుతోంది. అవేవాదాలైనా వాటి అస్థిత్వాన్ని మానవీయ వెలుగులో పాటించడం ద్వారానే ఆత్మిక సంబంధాలను స్థాపించేందుకు కృషిచేస్తాయి. అలాకాక అసూయాద్వేషాలే పునాదిగా జనించే సిద్ధాంతాలు వినాశకరమైన ప్రమాదాలను కొనితెస్తాయి. ఆత్మీయమైన మానసిక చింతనతో రాని మార్పు ఆధిపత్యం తెచ్చే భౌతికబలంతో వస్తుందనుకోవడం నూతన చాందసత్వంలో భాగం. ఏ యుగంలోని మానవుడి ఔన్నత్యానికైనా అతడు ఇతరులతో సంచరించిన సహృద్భావ శాంతియుత సహకార జీవన విధానమే ప్రమాణం అవుతుందిగాని విద్వేషజనిత అపార్థాలో, విధ్వంసభరిత అసూయా ద్వేషాలోకాదు. అంతిమంగా ఎంతటి మానవ స్వభావమైనా అది కట్టుబడాల్సింది అఖండమైన సత్యానికే గాని అమానవీయమైన ద్వేషానికి కాదు, కారాదు.

